శ్రీ రస్తు
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పెద్ద బొబ్బిలి రాజు కథ

---



పబ్లిషర్:
కొండా శంకరయ్య
పుస్తకముల వ్యాపారం
మహాకాళీవీధి, సికిందాబాదు.

---

ప్రీమియర్ ముద్రాలయమున ముద్రితము.
1946

శుద్ధప్రతి వెల రు. 0-12-0

శ్రీ ర స్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# పెద్ద బొబ్బిలి రాజు కథ



క॥ శ్రీకరసీతాపతియరి । భీకర భక్తప్రమోద బిసరుహ నయనా । నాకోర్కెలెల్లదీర్పవె । నీకున్ మ్రొక్కెదను మదిలో నీలశరీరా॥

తో హ ర

శ్రీగణనాధుని పాదపద్మముల చెలువుగ సేవించీ
శ్రీకరపద్మజురాణినిమదిలో సొంపుగనే మ్రొక్కీ
ముందుగ శ్రీహరిహరులనునే ముద్దుగ సేవించీ
వంతలేక గౌరీ సరస్వతుల పాదము సేవించీ
వరకవులగు పెద్దలకును భక్తితో వందనమొనరించీ
వరుసతో బొబ్బిలిరాజుకథనునే వరుసతో చెప్పెదను.

క థా ప్రా ర ం భ ము

వ॥ ఈభరతఖండంబున ఆంధ్రదేశమందు విజయనగర మను పట్టణమేలుచున్న రాజశ్రీ రామరాజుగారికిన్ని పై దేశమున బొబ్బిలి అనుపేరువహించిన పురమునకు అధిపతి యగు రాజశ్రీ రంగారావుగారికిని కొళ్ళమాత్సర్యముచే జరిగిన వ్రళయ కలహము.

బొబ్బిలికోట పాలించేటివారు దొరారంగరావు
విజయనగరము పాలించేవారు విజయరామరాజు

పేరుజెందిన సరదారయ్యా వ్రిభువురంగరావు
నీతులయందున విదురునిలాగున నింగుగలవారయ్యా
వీపుయందున వింజామరముంది రంగారాయుడికి
అరిపాదంబున దామర రేఖ రంగారాయుడికి
రాజచిహ్నాములు గలిగినవాడయ్యా రంగారాయుడు
వస్తాదిబిడ్డగా యున్నాడయ్యా రంగారాయుడు
రంగారాయుని తమ్ముడండీ వెంగళరాయుడు
కార్యమనగా ముందుకువచ్చును వెంగళరాయుడు
వెంగళరాయుని బావమరిది పాపారాయుడు
పాపారాయుడని పేరుజెప్పగా పట్నంలోపలనూ
పసిపిల్ల బాలాదులాదిగా పాలుతాగ్రిగరండి
హోరులేకనే యున్నాడయ్యా బొబ్బిలికోటలో
కోటలకంతయు కోరసింహము పాపారాయుడు
రంగారాయుని భావమరది ధర్మారాయుడు
బొబ్మిలికోటయేలుతున్నడు రంగారాయుడు
యెదురులేకనే బొబ్బిలికోట యేలుతుయున్నాడు.

వ. బొబ్బిలిరాజుగారికి అరికాలియందు పద్మరేఖయు చేతుల కమళదళంబున్న వీపున వింజామరమును, కన్నుల మచ్చయు, కపోలమున కనకమణియు, గలిగి విదురునివలె నీతిమంతుడై యెదురులేని శౌర్యముగలిగి వరాక్రముండగు వెంగళరాయుండనే తమ్మునితో నతని భావమరిది యగు పాపారాయుడును తనభావమరదియగు ధర్మారాయుండును గూడి శౌర్యములుమీరి యుద్ధములుకోర బొబ్బిలియందు నివసించుచున్నవారలు.

విజయనగరము యేలేవాడు విజయరామరాజు
కిరీటకుండలధారుడయ్యా విజయరామరాజు
ఆలోచనకు దొడ్డవాడయ్యా విజయరామరాజు
యొక్కదినమున నొక్కసమయమున విజయరామరాజు
తన్నుకొలిచెడి రావణులంతయు తాను పిలిచినాడు
అన్నలార తమ్ములారా నాయన్నలారా రండు
భూమియందున గొప్పపందెము మేము యాడితిమి
కోడిపందెము కొరకై యున్నదియన్నలార యిపుడు
కోడిపందెము ఆడనుయిపుడు మనసుబుట్టెనయ్యా
పేరుజెందిన సరదారిపందెము కోడిపందెమయ్యా
నాతోసరిగా కోడిపందెము యెవ్వరాడుతాడు
యీలాగున ఆలోచించెను విజయరామరాజు
అచ్చోటనే యున్నాడయ్యా ఆనందరాజు
అప్పుడేమని చెప్పినాడయ్యా ఆనందరాజు
చిన్నమనవి చిత్తగించుము పిన్నయ్యాదొరగారు
మీకుసరిగా పందెములాడు వెంగళరాయుండు
ఇట్టిమాటలు చెప్పినాడయ్యా ఆనందరాజు
అప్పుడేమి చెప్పినాడయ్యా విజయరామరాజు
వెంగళరాయునికి జాబును వ్రాయసాగెనయ్యా

వ. ఇట్లుండగ విజయనగరమేలేవాడు విజయరామరాజుగారు తొమ్మిదిలక్షల సైన్యాలముతో రత్నకిరీటములతో సొదాసోపాన సింహాసనములతో పచ్చని తోరణములతో ఆలోచన సభలతో ఆనందరాజు వైభవులతో నిండుకొలువుండి నొక్కనాడు సమీపమునయున్న సేనాపతుల గాంచి

మంచి పందెముల మించిన జయము వహించితిమి. కోళ్ళపందె మును చూడ ఆశించియున్నాడను నాతో సమానముగ పంతె మాడువా రెవరని యడిగిన ఆనందరాజు చేతులు ముకుళించి శిరముపైనిడి ఓస్వామీ బొబ్బిలియందును వెంగళరాయుఁ డను రాజు తమతో తమబలంబున పందెములు నొప్పునని చెప్పినమాత్రమున సంతుష్టి జెంది వెంటనే జాబు వ్రాయ నుద్యుక్తుడాయెను.

పరాకుంచక వినండిమీరు వెంగళరాయూడా
చిన్నమనవిదా చిత్తగించుడు వెంగళరాయూడా
కోడిపందెము యాడనుయిప్పుడు యిచ్చలు గొన్నాను
కోడిపందెము ఆడుదామయ్యా వెంగళరాయూడా
విజయనగరము బొబ్బిలిమధ్య యెల్లసదరునందూ
డేరాలు యిచట వేయించవలెను వెంగళరాయూడా
గురువారమందె వచ్చెదమేము యెల్లసదరుకేనూ
చుట్టుప్రక్కల కోళ్ళనురాజా తయారుజేసుకొని
గురువారమందె చేరవలెనయ్యా యెల్లసదరుకుదా
నాతాలూకాయందు కోళ్ళనంతయు తెప్పించుతాను
కోడిపందెము ఆడిమనము తమాషజూస్తామూ
మీరుగెలిచితే కీర్తిపేరు మీకే గలుగూను
మేము గెలిచితే కీర్తిపేరు మాకేగలుగూను
ముందువెనుక చూడవద్దయ్యా వెంగళరాయూడా
ఈరీతిగా వ్రాసినాడయ్యా జాబులు అపుడుదా
లక్కోటచేత బంధించినాడు రాజు అపుడుదా
హర్కారులచేత యప్పుడుయిచ్చెను జాబూను

జాబుయిపుడు బొబ్బిలికోటకు చేరవలెనయ్యా
రంగారాయుడు వెంగళరాయుడు చేతికివ్వండి
మరల ప్రత్యుత్తరవుకోవలెరండయ్యా హర్కారులు మీరు

వ. బొబ్బిలిదొరయగు వెంగళరావుగారికి రంగారావుగారికి వ్రాయునది యేమనగా, కోడిపందెములాడుటకై మాపురము వెలుపల డేరాలు వేయించి యున్నాను మా తరవునయున్న చుట్టుపట్టు జమీనుల కోళ్ళనన్ని తెప్పించుచున్నాము. అట్లె తాము‌న్ను తమచుట్టుపట్లగల కోళ్ళను బృహస్పతివారము వుదయమున తప్పకవచ్చి కోళ్ళపందెముల తమాషాలజూచి కీర్తులు వహించెదముగాన అవశ్యముగ రాకోరెదను అని జాబు వ్రాసి హర్కారులచేతికిచ్చి బదులు తెమ్మని బొబ్బిలికి పంపించెను.

జాబులెత్తుకొని వస్తున్నారు హర్కారులయితేను
బొబ్బిలివారి దేవిడికాడికి టంకామైనారు
పారాహద్దున నిలచినారయ్యా హర్కారులపుడు
యెవ్వారియొక్క పారాయున్నారు పారాచౌకీలు
రాజుగారి తాలూకాయని వారు చెప్పినారు
రాజుగారి జాబులు మేము తెచ్చియున్నాము
పారాలయ్యా బాటలు విడవండి మేము బోవుటకు
వేంగళరాయుడు బేటికిపోయి హుకుము తెస్తాము
గడియసేపుదా నిధానించండి హర్కారులు మీరు
యెచ్చటనుండి వచ్చినారయ్యా పారాచౌకీలు
రంగారాయుడి ముందుకువచ్చి వందనమొసగిరీ
వరాకులేక వినుము యిప్పుడు రంగయ్యదొరగారు

మీదు పేరట జాబులు యివుడే దేవిడికొచ్చేను
రమ్మని చెప్పితె వంపెదమయ్య రంగయదొరగారు
పంవమని యపుడు సెలవుయిచ్చెను రంగారాయూడు
యెచటినుండి వచ్చినారయ్యా పారాచౌకీలు
రంగారాయుడి భేటికిచూడను వస్తూవున్నారు
రంగారాయుడు ముందుకువచ్చి నిలిచినాడయ్యా
వందనమయ్యా వందనమయ్యా రంగయ్యాదొరగారు
వందనమొసఁగి జాబులుపెట్టిరి కొలువున యపుడుదా

వ. అంతహర్కారులు జాబునెత్తుకొని కోటవాకిట నిలిచి రంగారావుగా రుత్తరువుపొంది లోనికిబోయి రంగా రావుగారికి నమస్కరించి వుత్తరము చేతికిచ్చి నిలచిరి.

లకోటచింపి జాబుచదివినారు రంగారావుదా
జాబునయుండు సంగతులంతా కన్నులచూసేను
తనలోతాను నవ్వుచున్నాడు రంగయ్యాగారు
వెంగళరాయుని ముఖముజూచి నవ్వసాగెను
పరాకుంచక వినుము యిపుడు వెంగళరాయూడా
మీపేరిటనే జాబులు వ్రాసినారు రాజుగారు
జాబునయుండు సంగతులంతయు కన్నులచూడండి
ఇట్లుచెప్పుతూ జాబునుయిచ్చెను చేతికి యపుడుదా
జాబునుయపుడు కన్నులచూచెను వెంగళరాయుండు
వుత్తరం యపుడు వ్రాయసాగెను వెంగళరాయుండు
పరాకుంచక వినుముయిప్పుడు విజయరామరాజా
మీరువంపిన జాబువచ్చెను మాకుయివుడుదా
జాబునయుండు సంగతులంత కన్నుల చూచినాము

గురువారమే వస్తువున్నాము మన్నెంమీదికి
మన్నెంమీదికి మీరురావలెను రాజులు దొరలంతా
ఇన్నివిధములుగా వ్రాసినారయ్యా జాబులో యప్పుడుదా
జాబువ్రాసిదా హర్కారులచేతిలో యపుడు యిచ్చెను
జాబులెత్తుకొని వస్తువున్నారు హర్కారు లపుడుదా
జాబులోని సంగతినంతయు కన్నులజూచేనూ
తనతాలూకాకు జాబులు యపుడు వ్రాస్తువున్నారు
డెబ్బైయేడు పాలెగాండ్లకు జాబులు వ్రాసేనూ

వ. రంగారావుగారు జాబువిచ్చి చూచి వెంగళ రాజువద్దికి వచ్చి ఒండొరులు చిరునవ్వు నవ్వుచును వెంగళ రావుగారు బదులుత్తరము వ్రాయడమేమనగా, రాజరాజును విజయరాజుగారికి వ్రాయునది, తామువ్రాసినజాబు చూచి నాము, మీ యిష్టవ్రకారం 'మన్నెంమీదికి మా కోళ్ళను మాతోచేరినవారి చుట్టుపట్ల కోళ్ళతో గురువారం ఉదయ మున వచ్చిచేరుతున్నాము అని బదులుత్తరము వ్రాసి యిచ్చిరి. ఆజాబునెత్తుకొని, హర్కారులు విజయరామరాజు గారికి వినయవందనములు జేసి జాబుచేతికిచ్చి నిలిచిరి,

బొబ్బిలివారిపై కోడిపందెమునకు బోతూవున్నాము
రాణువలంతయు రావలెనయ్యా కోడిపందెముకూ
వింతవింత లక్షకోడీలు డాబుకు తెన్నండి
ఈలాగున వ్రాసినాడయ్యా జాబును యపుడుదా
మంచివన్నెల కోళ్ళనంతా బట్టుతువున్నారూ
శుద్ధమైన కోళ్ళనుయపుడు తయారుచేసీరీ
డేగవన్నె కోళ్ళనుయపుడు తయారుచేసీరీ

మంచిమంచికోళ్ళను యపుడు తయారుచేసిరీ
విజయనగరము తెచ్చినారు కోళ్ళను యపుడుదా
యెటుపక్కజూచిని కోళ్ళుయున్నవి యప్పుడై తేనూ
గలగలగల సవ్వినాడయ్యా విజయరామరాజు
మంచిమంచికోళ్ళను యపుడు తయారు జేస్తివిా
తామసమేమి మన్నెంమీాదికి తయారుగన్నండీ
యీావిధంబుగా పలికినాడు రాణువలంతాను
యీారీతిగా యున్నాడయ్యా విజయనగరమందూ
బొబ్బిలియందు యెట్లున్నాడు రంగయ్యదొరగారూ
తనతాలూకాను జాబులు యపుడు వ్రాస్తుయున్నారు

వ. అపుడు విజయరామరాజుగారు లకోటవిచ్చిచూచి చుట్టుపక్కల యున్న పానయండ్లనుంచి పంచ వన్నెల కోళ్లతో తయారుగా రమ్మని ఆజ్ఞాపించగానే వారు జగడమునకు తయారు పెద్దకోళ్ళతో విజయనగరం మన్నెం మీాదికి రాగానే రాజుగారును చూచి తయారై యుండిరి.

డెబ్బైవేడు పాళెదారులకు జాబులు వ్రాసీరి
అన్నలార తమ్ములార మాయన్నలార యపుడు
కోడిపందెము వొప్పిమేము పోతూవున్నాము
కోడిపందెమును రావలెనయ్యా యల్లాదొరలుదా
మంచిమంచి కోళ్ళనంతా తయారుచేసుకొని
విన్నవేగము యందరుయపుడు భేటికిరన్నండి
యీారీతిగా వ్రాసినాడయ్యా జాబులు యపుడుదా
హర్కారుల యపుడు బిలచెనయ్యా భేటికిముందుగా
జాబుయెత్తిదా చేతికిచ్చె రంగయ్యదొరగారూ

హర్కారులప్పుడు జాబులెత్తి నడవసాగిరి
వారివారిజాబులు యప్పుడు వారికిచ్చిరి
జాబులుచూచి సంతోషపడ్డారు యెలమాదొరలుదా
మంచిదన్నారు బాగన్నారు రాణువలంతానూ
వింతవింతకోళ్ళను యప్పుడు పట్టుతుయున్నారు
పేరుయెత్తిన కోళ్ళనుయప్పుడు పట్టుతుయున్నారు
కోళ్ళనంతియు తయారుచేసిరి యెలమదొరలుదా
వెంగళరాయుని బేటికివచ్చి వందన మొసగిరి
ఆజ్ఞప్రకారము కోళ్ళనుయప్పుడు తయారుచేస్తిమి
మంచిమంచి కోళ్ళను యప్పుడు తియారుచేస్తిమి
తామసమేమి మన్నెంమీదికి త్వరలో రన్నండే
యీలాగు చెప్పినారయ్యా రాణువలంతానూ
మంచిదన్నాడు అప్పుడుమాట వెంగళరాయుడూ
కాసాకోళ్ళను తెమ్మన్నాడూ వెంగళరాయుడూ
కాదరికోళ్ళను తెమ్మనాడూ వెంగళరాయుడూ
కోళ్ళను యప్పుడు శృంగారించెను వెంగళరాయుండు
బంగరుకాళ్ళను అందెలుయప్పుడు కోళ్ళకు దొడిగెను

వ. బొబ్బిలియందు రంగారాయుగారు హర్కారులను పిలిచి దెబ్బదయేడు పాళెములకు జాబులుయిచ్చి పందెము నకు జయముపొందిన మంచివన్నె కోళ్ళతో వేగరమ్మని ఆజ్ఞపంపెను. అంత యెలమాదొరలంతా సంతోషించి పేరుపడిన కోళ్ళనుబట్టి వెంగళరాయుని యెదుట నిలిపి నమస్కరించి శీఘ్రముగా మన్నెంమీదికి రమ్మని పిలిచిరి.

సాగసైన పట్టుకుచ్చులు గట్టెను కోళ్లకు

యీరీతిగా శృంగారించెను కోళ్ళను యప్పుడూదా
వస్త్రాదికోళ్ళను తయారుచేసెను వెంగళరాయుండూ
కోడిపుంజుల తయారుచేసెను వెంగళరాయుండూ
అన్నగారి భేటికివచ్చెను వెంగళరాయుండూ
పరాకించక వినండిమీరు రంగయ్యదొరగారూ
తామసమేమి మన్నెంవీడికి తయారుగరన్నండీ
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండూ
మంచిదన్నాడు అట్టివేళలో రంగయ్యదొరగారూ
బావమరిదిని పిలిపించినాడు రంగయ్యగారూ
పాపారాయుణ్ణి పిలిపించినాడు యట్టివేళాలో
అన్నతమ్ములు బావమరుదులు యందరు వెడలిరి
వారివారి రాణువలంతయు వెంటనే వెడలిరి

బావమరది భేటికివచ్చి వందనమొసగిరి
పరాకుంచక వినండిమీరు పాపారాయుడూ
యింక తామస మేమన్నారు పాపారాయుడూ
అక్కడనుంచి ప్రయాణమైరి రంగయదొరగారూ
తన్నకొలిచె రాణువలంతా వెంటనే వెడలిరి
విజయనగరము బొబ్బిలిసందు యెల్లసదరుకేదా
యెల్లసదరుకు వచ్చిచేరిరి బొబ్బిలిదొరలుదా
డేరాయపుడు వేసినాడయ్యా వెంగళరాయుండు
డేరాలోపల కొలువుదీరిరి బొబ్బిలిదొరలుదా
అన్నదమ్ములు బావమరుదులు కొలువుతీరినారూ
అచ్చట చల్వపందిళ్ళు వేసిరి కోళ్ళకుయపుడూబా
రాజవారి కోళల యిప్పుడు చూస్తున్నారు

వ. నిలువగానే వెంగళరాయుండు సంతోషించి బంగారుఅందెలు కట్టించి పట్టుకుచ్చులు వేయించి రంగయ్యా దొరగారైన అన్నగారి సముఖమునకు వచ్చి శీఘ్రము తయారు కమ్మని వేడగా వారు బావమరిదియగు పాపా రాయుణ్ని వెంటబెట్టుకొని తన్ను రాణువలంత గొలువగ అతి ఆర్భాటమున జయజయమని ఘోషలతో బొబ్బిలి దొరలు విజయనగర కోటయెల్లలో సరదారులంతా జేరి తమ్ముడు బావమరుదులతో కొలువుదీరి డేరాలలోదిగిరి.

యిక్కడికథలు యీలాగునవున్నది యెల్లసదరులోనా
విజయరామరాజు వెడలెను అట్టి సమయమందూ
తన్నుగొలిచెటి రాణువలంతయు అపుడువెడలినారూ
బొబ్బిలివారియెల్లసదరుకైనా దాకలైనారూ
రాజుగారి యెల్లయందు డేరావేసినారూ
కోళ్ళకుక్కయపుడు పందిళ్ళయినా గొబ్బునవేసినారూ
కర్చీవేసి కొలువుతీరెను విజయరామరాజు
డేరావిడిచి బైటికివచ్చిరి బొబ్బిలిదొరలూదా
రాజుగారును బొబ్బిలివారును భేటీయైనారూ
అక్కడ జోడీకుర్చీలు వేసినారు యపుడు
కుర్చీమీద కొలువుదీరెను రంగయ్యా దొరగారూ
పచ్చకుర్చీయందు కొలువుతీరెను వెంగళరాయుండూ
రంగయ్యదొరగారు రాజుగారున్ను కౌగలింపులాయే
వెంబడియున్న యెల్మాదొరలాతో యేమనిచెప్పెను
ముందుగ యపుడు మీరేనయ్య కోళ్ళనుదించండి
మంచిదన్నారు బాగన్నారు యెల్మాదొరలూదా

పొద్దుప్రొద్దున కోళ్ళను అపుడు దించుతున్నారూ
మొత్తడుకోళ్ళు దింపుడుకోళ్ళు తయారుచేసిరీ
కోడివందెము సెలవిచ్చినారు రంగయ్యదొరగారూ
రాజుగారిని అప్పుడుజూచిరి రాణువలంతాను
రాజుగారును సెలవ్రుయిచ్చెను వందెమునకుదా
మంచికోళ్ళను దింపించినారు సేవకులైతేను
వారివారికోళ్ళకు అపుడు కత్తులు కట్టిరి
కోళ్ళను విడిచి అట్టివేళలో లడాయిపెట్టిరి
కలకలమని కొక్కరించెను కోళ్ళుయపుడూదా
యెగిరిలాగెను బొబ్బిలికోడి యోజనంబుపొడుగూ
యెగిరియెగిరి నెత్తియందు బాగుగపొడిచేను
గిరగిరదిరిగి భూమినపడెను రాజుగారికోడి
అప్పుడెట్లావున్నాదయ్యా బొబ్బిలికోడైతే
కాలుబిగువున వదికోళ్ళను కారునజంపేను
కొక్కరించి కూతవేసెను కోడీయపుడూదా
కూతవేసి కోళ్ళమీదికి దూకుతువున్నాది
యెక్కడికోళ్ళను చేరనివ్వక తరుముతుయున్నాది
గాయముతగిలిన కోళ్ళను కట్టివిప్పుతున్నారు
రెండవకోళ్ళను యపుడురాజు దింపినాడు
తయారువరచి విడిచినారయ్యా కోళ్ళనుయపుడుదా
కేకలపుడు విన్నాదయ్యా బొబ్బిలికోడీదా
యెక్కడలేని కోపముగలిగెను బారాకోడికీ
వచ్చినంతనే కన్నులజూచెను కోళ్ళనపుడూదా
రెక్కలప్పుడు తట్టినిలిచెను బారాకోడీదా

కోళ్ల మీదికి దూకెనయ్యా బారాకోడీదా
కూతలువేసిన కోళ్ళను అప్పుడు కొక్కరించిచంపె
ముక్కునకాలున పొడిచిచంపెను బారాకోడీదా
రెక్కల చాటున అదిమిపట్టెను బారాకోడీదా
కాళ్ళతన్ని గొంతులుగోసెను బారాకోడీదా
మెత్తుకుదింపుడు కోళ్ళను అప్పుడు చంపివేసినాది
రాజుగారి కోళ్ళనుయిప్పుడు చంపివేసినాది
రాజుగారికోళ్లున్నంతా హతమైపోయేనూ
యింతవరకు దెబ్బలేదయ్యా బొబ్బిలికోడీకీ
పేరుజెందిన సరదారుకోడి బొబ్బిలికోడైనా
అచ్చటయున్న కోళ్లనంత విడిపించినారయ్యా
అన్నికోళ్లను తరిమిచంపె బొబ్బిలికోడైతే
ఇంతలోకి యేమన్నాడు విజయరామరాజు
పరాకులేక వినండిమీరు వెంగళరాయూడా
కాసాకోళ్ళను విడిపించెదము వెంగళరాయూడా
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
అప్పుడేమని పలికినాడయ్యా వెంగళరాయుడూ
దగ్గరయున్న సేవకులతో యేమనిచెప్పేను
మంచికోళ్లను దింపించండి విజయరామరాజు
నెమిలి పొడికోళ్ల రాజా తాయిగ తెన్నండి
ఈరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
మంచిదన్నారు అట్టివేళలో సేవకులయితేను
తెచ్చినకోళ్ళను కన్నులచూచెను వెంగళరాయుడూ
కత్తులచూపుడు కాళ్లకుగట్టిరి కోళ్ళకయినాను

కోడినియపుడు సవరించినాడు వెంగళరాయుండూ
పరాకుంచక వినుమయిపుడు బారాకోడిదా
మన్నెంవీరాదికి యెల్ల సదరులో కీర్తి తెన్నండీ
యెన్ని కోళ్ళలో పేరెత్తినావు బారాకోడిదా
నీదుమానము చూడవలెను బారకోడిదా
నీదుబలము చూడవలెను లడాయిలోగాను
జంటకోడి ఆయుధంబున భూమినపడెనూ
నీవుకాని ఆయుంధంబున భూమినపడవలెనూ
పేరుకీర్తులే తేవలెనయ్యా బారాకోడిదా
ఇట్లుచెప్పి దువ్వినాడయ్యా బారాకోడిదా
మంత్రికోళ్ళు తెప్పించినాడయ్యా విజయరామరాజు
రాజుగారి కోడినియపుడు ముందుగదింపిరి
రాజుగారికోడిని చూచెను వెంగళరాయుడూ
తనకోడిని సవరించి తాయిగ విడిచేను
రెండుకోళ్ళను అట్టివేళలో తాయిగదింపిరిగా
దింపుడుకోడిని కన్నులచూచెను బారాకోడైతే
దగ్గిరదగ్గిరవస్తున్నాది బారాకోడైతే
జగ్గివచ్చె రాయుడికోడిని కన్నులచూచేనూ
యెగిరినాదిర బొబ్బిలికోడి యోజనపొడుగూన
దుమికినాదిర బొబ్బిలికోడి దుమ్ములు యెగరగను
రాజుకోడికీ రాయుడుకోడికి కలపట్టయినాది
యెగిరినకోడిని కన్నులచూచెను రాజుగారికోడి
యెగిరినయొక్క రాయుడికోడి భూమికితగేను
రాయుడుకోడికి బలములేదుగా చంపడానికీ

తొలిదెబ్బ తప్పించుకున్నాది రాజుగారికోడి
రెండవతూరి కలవటమాయె బొబ్బిలికోడీపై
రెక్కలుయపుడు తట్టినిలిచెను రాయుడికోడిదా
పొంచిపొంచి బొబ్బిలికోడి గుంపులోదూరేను
రెక్కలతోను తట్టిందిరా బారాకోళ్ళను
గుండెపట్టిదా నేలకువంచె బారాకోళ్ళను
పేగులు కండలు నేలకుబడ్డవి కోళ్ళకుయపుడుదా
గిరగిరగిరగిరగిరగిరగిరగిర భూమినపడ్డది
వంగివంగి రాయుడికోడి వస్తూవున్నది
కొక్కరించి నిలిచియప్పుడు కూతలు పెట్టెనూ
యెత్తుడుదింపుడు కోళ్ళనుయపుడు చంపుతుయున్నాది
అప్పుడెట్లాయున్నాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి కోడినియప్పుడు కన్నులచూసేను
యక్కడలేని కోపముజెందె రాజుగారుయపుడు
కుడిమీసమును నిమిరినాడయ్యా గుడ్లెరజేసి
కోపముచేతి దేహముమరచి యేమనిచెప్పెనూ
అన్నలార తమ్ములార మాయన్నలార రండు
దింపుడుకోళ్లను తెమ్మనిచెప్పెను యట్టిసమయమందు
తెచ్చినకోడిని కన్నులచూచెను రాజుగారుయపుడు
అప్పుడెట్లావున్నాడయ్యా పాపారాయుండు
వెంగళరాయుని ముఖముజూచి ఘల్లున నవ్వేనూ
చదురుదిగ్గున లేచినాడయ్యా పాపారాయుండు
నాదుపేరిట కోడివందెము నేను పెట్టుతాను
ఘుడియసేప్పుడా నిధానించెను వెంగళరాయుండు

యీావిధంబుగా పలికినాడయ్యా పాపారాయుండు
యింతలోపల కానాకోళ్ళను తాయిగ తెచ్చిరి
తెచ్చినయొక్క కోళ్ళరాజు కన్నులజూచేను
కాకివంటి కోడినిబట్టి పాపారాయుండు
బంగారంపు అందెలు యిపుడు కాళ్ళకువేసేను
చెక్కిలిముద్దు మద్దులాడెను పాపారాయుండు
ముందువెనక జూడవద్దు బారాకోడీదా
మన్నెంమీాదున యెల్ల సదరులోన కీర్తి తెన్నండీ
ఇచ్చటచచ్చినవారికి చాలా వీరస్వర్గమూ.
చావంటె మీారుభయపడవద్దు బారాకోడీదా
యెన్నాళ్ళు బ్రతికిన చావుసిద్ధము బారాకోడీదా
బొబ్బిలియందు పుట్టినావురా బారాకోడీదా
బొబ్బిలివారికి యిపుడునీవు కీర్తి తెన్నండి
యీారీతిగా పలికినాడయ్యా పాపారాయుండు
రాజుగారికోడిని యపుడు ముందుగ విడిచీరి
రాజుగారి కోడిమీాదనే పాపారాయుండు
తనయొక్క కోడిని విడిపించినాడు పాపారాయూడు
రెక్కలుయపుడు తట్టినాదిరా రాయుడుకోడీదా
రాజుగారి కోడినియపుడు కన్నులచూచింది
యెగిరినాదిరా రాయుడికోడి యోజనంబుపొడుగూ
యెగిరియెగిరి గిరగిరతిరిగి భూమినపడ్డాది
రాజుగారు తనకోడి మరణము కన్నులచూచేను
యెక్కడలేనికోపమువచ్చె రాజుగారికపుడు

—(రెండవసారి కోళ్ళజగడము)—

యెత్తుడుదింపుడు కోళ్ళను రాజా వేయించినాడూ
వచ్చేటికోళ్ళను కన్నులజూచెను బారాకోడీదా
యెగిరి యెగిరి యిరువైముప్పైకోళ్ళను జంపేను
దూకిదూకున ముప్పైనలుబైకోళ్ళనుజంపేను
కాళ్ళకిందికి చారదీసెను బారాకోళ్ళను
వక్కకాలితో తక్కిన కోళ్ళ గొంతులుకోసేను
రెక్కలయినా తాటించినాదిరా రాయుడికోడేమీ
రెక్కలకిందా కొంత కోళ్ళుగా హతమైపోయినాది
యేతట్టుజూచినగాని కోడిపుంజులేమి
యెగిరితన్నికోళ్ళను యపుడుతాయిగ చంపేను
మన్నుంవిడిచి వెళ్ళినాదిరా రాజుగారికోడి
పిల్లపిల్ల తిరిగిజూడక పారిపోయినాది
కోళ్ళతరిమి రాయుడికోడి చేతికివచ్చేను
చెక్కిలిమువ్వ ముద్దులాడి చేతనుయెత్తేను
సేవకుల చేతికిచ్చేను బారాకోడీని
అప్పుడెట్లావున్నాడయ్యా పాపారాయుడు
వెంగళరాయుడు రంగారాయుని ముఖముజూచినవ్వె
బొబ్బిలివారు గెల్చినారు రాజు వోడినాడు
అప్పుడెట్లావున్నాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి ముఖముజూచి విజయరామరాజు
పాపారాయుని వెంగళరాయుని ముఖముజూచినాడు
ముశిముశినవ్వులు నవ్వుకొన్నారు బావమరదూలూ
యెక్కడలేని కోపమువచ్చె రాజుగారికపుడు

మంచిదన్నాడు బాగన్నాడు విజయరామరాజు
అక్కడవుండే డేరాలంత కట్టివేసినారూ
విజయనగరము వచ్చిచేరెను విజయరామరాజు
కొలువుచావిడిలో కొలువైనాడూ విజయరామరాజు
ఆలోచన చేస్తున్నాడయ్యా విజయరామరాజు
వక్కపెళితాలో లేపించవలెను బొబ్బిలికోటాలూ
ఇట్లు రాజుగారికి కోపము అయితే మనస్సున వున్నాది
వీరికథలు యీలాగున వున్నది విజయనగరమందు
మన్నెంమీదికి వచ్చినారుగా బొబ్బిలిదొరలేమీ
అన్నదమ్ములు బావమరుదులు బొబ్బిలిచేరిరి
వీరికథలు యీలాగునవున్నది బొబ్బిలికోటలో
యిటులా కొద్దిరోజులు కాలము జరిగినతరువాత

వక్కనాటికాలమందున

పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంశీలబూచి
గోల్కొండ నవాబుదగ్గర పరమానందేను
కళింగరాజ్యంకటకందాక పాచ్చాకములాయె
సీకాకొళమే సింధుకడియమే పాచ్చాకములాయె
గోల్కొండకు ప్రియాణమాయె ఫ్రాంచిదొరగారు
వొంటెలమీద గుర్రాలమీద పైకంయెత్తుకొని
తనమందమార్బలంరాజా వెంటతీసుకోని
మందుగుండు సామానులతోటి ప్రియాణమాయెను
గోల్కొండకు వచ్చిచేరిరిగా ఫ్రాంచిదొరగారూ
గోల్కొండలో దుర్గామిట్టల డేరావేయించి
యెండలాకు యెత్తించినారు యెజ్ఞపట్టుడేరా

సీడలాకు యెత్తించినారు సీలివట్టుడేరా
మంచులాకు యెత్తించినారు మైనవులండీలు
కామసందు డేరాలోగా కొలువుతీరివారూ
గోల్కొండ పాచ్ఛావుకు రాజా వరదీ బంపేను
గోల్కొండ జమాబందికి మేమే వస్తిమి
మీ లెక్కపక్కలు జమాబందిని కాయగ జూడండి
ఈవిధమున వరదీచాలా వ్రాయిగ పంపేను
మంచిది మరిబాగాన్నాడు పాచ్ఛావుదొరలు
లెక్కలువక్కలు జమాబందిని జూస్తువున్నారు
లక్షాపైకము చెల్లించెను పాంచిదొరగారు
అప్పుడేమని పలినాడుగ పాంచిదొరగారు
పాంచిగారికి పాచ్ఛావుకు రాయితి వున్నాది
అతరవోగా వుండేసమయమందున పాంచిదొరగారు
స ధిచేనుక మనవిచేసెను పాంచిదొరగారు
పరాకులేక వినండిమీరు పాచ్ఛావు దొరలు
తూర్పుదేశం చూడనునాకు వాంఛాయున్నది
తూర్పుదేశంజూచి నేను పుదుచ్చేరికేమి
పుదుచ్చేరయినా చేరుతానుగా పాచ్ఛావుదొరలు
ఈవిధంబున మనవిచేసెను బూచిదొరగారు
బూచిమాటలు విన్నారండి పాచ్ఛావుదొరలు
చాలించు చాలించు వోయి బూచిదొరగారు
దూర్పుదేశం కర్నాటకము చాలావున్నాది
కర్నాటక పాచ్ఛావులు నిన్ను అటకాయించేరు
కాసిపోని మాటలవల్ల కలహం పుట్టును

పుమచ్చేరికి పొమ్మన్నాడండి బూచిదొరగార్ని
ఈవిధంబున పలికినాడుగా పాచ్చాపుదొరలు
అప్పుడేమని పలికినాడుగా బూచిదొరగారూ
అంతమాట సెలవివ్వారద్దు పాచ్చాపుదొరలు
మీతాలూకాకు మద్దత్తయిన తాయిగ పంపండి
ఈవిధంబుగా పలికినాడుగా బూచిదొరగారు
గొప్పగొప్ప పుల్వాయలే సజరు పెట్టినారు
బూచిగారు పుల్వాయలకే సంతోషపడినారు
మంచిది మాబాగన్నాడండి పాచ్చాపుదొరలు
అయినా నమ్మవద్దుర నమ్మరాదుర పాపించివారిని
బందరు మరికాపురస్తుడు దుబాసిలక్ష్మడు
కాకితంబు కలంపుల్లగా చేతబట్టినాడు
దుబాసివారి లక్షుమయ్యాకే జాబులు వ్రాసేనూ
విన్నదివేగం కన్నదిశీఘ్రం దుబాసిలక్షుమయ్యా
జాబులుజూచిన తక్షణమున నాబేటికి రన్నండి
గోల్కొండకే చేరవలెనుగా దుబాసిలక్ష్మడా
ఈవిధంబున జాబులువ్రాసి తయారుచేసేను
హార్కారీల చేతికిచ్చేను జాబుకమ్మలేమి
బందరుకైన పంపినాడుగా పాచ్చాపుదొరలు
దుబాసివారి లక్షుమయ్యావో బేటికివచ్చిరి
నిందుకొలువున జాబులుపూచి దండంబెట్టిరి
లకోటాలు మరిచించినాడు జాబు చదివినాడు
జాబులోని వర్తమానము కన్నులజూచేను
గోల్కొండకే బయలుదేరెరా దుబాసి లక్షుమయ్యా

పాచ్చావుల బేటికివచ్చిసలాంచేసేను
బైటోఅనగా నిండుకొలువున కొలువుతీరినాడు
జాబుకైన మళ్ళినాడు దుబాసిలక్షుమయ్యా
నన్ను పిలిపించిన కారణమేమి పాచ్చావుదొరలు
పరాకులేక వినండిమీరు దుబాసిలక్షుమయ్యా
తూర్పు దేశం చూడను బూచి వస్తువున్నాడు
మందుగుండు సామానులతోటి బూచివస్తాడు
అక్కడా జర్గికార్యము జరగకుండా తీసుకపొన్నండి
యెదురు భేటికి రమ్మనిచాలా జాబులు వ్రాసేనూ
తూర్పు దేశం కర్నాటకము చాలావున్నది
కర్నాటక పాచ్చావులవద్ద గల్బా లేకుండ
తిరిగివుదుచ్చేరికి పంపించినా బేటికిరన్నండి
ఈవిధంగా పల్కినారుగా పాచ్చావుదొరలు
శల్వాలు అంది బూచిగారివో భేటికివచ్చేను
సలాంనీకు సలాంనీకు బూచిదొరగారు
తూర్పు దేశం పోదామండి బూచిదొరగారు
ఈవిధాంబుగా పలికినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
కట్టించిరి డేరాలాడ గాడిబండ్లమీద
ఎత్తించిరీడేరాలాడ ఎద్దులమీదాను
తన్నుగొలిచే రాణువలంతా ప్రియాణమైనారు
దండుకుమనను బేదారుగా హైదరుజంగోజ
హైదరుజంగు ప్రయాణమాయె ఆసుడియాలోన
మందుగుండు సామానులతోటి ప్రియాణమైనారూ
గోల్కొండ లేచిన మజలి యెక్కడ దిగుతారూ

అనకాపల్లెలో మకాంచేసిరి బూంచిదొరగారు
అనకాపల్లెలో లేచినమజిలి యెక్కడదిగుతారు
అనకాపల్లెలో లేచినమజిలి రేఖలవలసలో
రేఖలవలసన లేచినమజిలి సోడారములోను
సోడారములో లేచినమజిలి ఎక్కడదిగుతారూ
సోడారములో లేచినమజిల పిఠాపురములోను
పిఠాపురములో లేచినమజిలి ఎక్కడదిగుతారూ
పిఠాపురములో లేచినమజిలి పెద్దాపురములోను
పెద్దాపురములో లేచినమజిలి రావులచెరువులోను
రావులచెర్వులో లేచినమజిలి నల్లచెరువుకాడా
డేరాలోపల కొలువైనాడు ప్రాంచిదొరగారూ
దుబాసివారి లక్షుమయ్యనే భేటికిపిలిపించి
పరాకులేక వినండిమీరు దుబాసిలక్ష్మయ్యా
విజయనగరము యేలేవాడు విజయరామరాజు
రాజుగారి పేరిట వక్కాకాగితం పంపండి
ఇన్నిమాటలే పలికినాడుగా ప్రాంచిదొరగారూ
కాగితం కలంపుల్లగ చేతబట్టినాడు
పరాకులేక వినండిమీరు విజయరామరాజా
పుసుచ్చేరి యేలేటివాడు ప్రాంచిదొరగారూ
ఇరువదినాలుగువేల దళముతో ప్రాంచివచ్చినాడు
తూర్పుదేశంచూచి వాడుప్రాంచిపోతాడు
మీరు ఎదురుసేవకే రావలెనయ్యా విజయరామరాజు
ఇన్నిమాటలే వ్రాసినాడుగ జాబుకులోగాను
జాబువ్రాసి హర్కారుల చేతికిచ్చినాడు

విజయనగరమే పంపినాడు జాబుకగనుకాను
తిరిగి కాగితంబు కలంపుల్లను చేతబట్టినాడు
బొబ్బిలియేలే రంగయ్యాకు జాబువ్రాస్తాము
వరాకులేక వినండిమీరు రంగయ్యదొరగారూ
పుదుచ్చేరి కాపురస్థుడు ప్రాంచిదొరగారూ
తూర్పుదేశం చూడనురాజా వస్తువున్నాడు
ఎదురుబేటికి రాలెనయ్యా రంగయ్యదొరగారూ
ఇన్ని వైనములు వ్రాసినాడుగ జాబుకలోగాను
హర్కారుల చేతికిచ్చిదా జాబునంపినాడు
బొబ్బిలికోటకు పంపినాడుగ జాబుకమ్మలేమి
బొబ్బిలివారి దేవిడీకాడా పారాలున్నాది
డేరాకాడికి దాఖలైరి హర్కారులేమి
ఎవ్వరితాలూకన్నారండి పారాచౌకీలు
దుబాసివారి లక్షుమయ్యా నీతాకీ పంపాడు
పాచ్చావుల దివానగిరి దుబాసిలక్షుమయ్యా
జాబుకమ్మలు వ్రాసిపంపెను దుబాసిలక్షుమయ్యా
ఈవిధంబున పల్కినాడుగా హర్కారులేమి
అప్పుడేమని పల్కినారు హర్కారులేమి
రంగరాయుడు బేటికిపోయి వరదీ తెస్తాము
అంతవరకు సిథానించుడు హర్కారులేమి
అక్కడనుండి వచ్చినారు పారాచౌకీలు
రంగారాయుడి బేటికివచ్చి దండంబెడతారూ
పాచ్చావుల దివానగిరియట దుబాసిలక్షుమయ్యా
జాబుకమ్మ లందించినాడుగ దుబాసిలక్షుమయ్యా

దేవిడికాడ వున్నాడండీ హర్కారులేమి
రమ్మంటారాపొమ్మంటారా రంగయ్యదొరగా
రమ్మనిచాల సెలవిచ్చెను రంగయ్యదొరగారూ
అటకాయింపు లేకుండనే రమ్మనిచెప్పెను
శల్వోలు అందివచ్చినారుగ పారాచౌకీలు
అక్కడనుంచి వచ్చినారుగ హర్కారులేమి
రంగారాయుడి కొల్వుకురాజా కదలివచ్చినారూ
కొలువునిలిచి రాజుకుగనుక దండంపెట్టిరి
లకోటాలు మరిచించినాడుగ జాబు చదివినాడు
పంక్తిపంక్తి పారజూచెను రంగయ్యగారు
జాబులోని వర్తమానము కన్నులజూచెను
తిరుగుజాబులే వ్రాయలేదు రంగయ్యదొరగారు
వారికథలు ఆలాగున్నది బొబ్బిలోగాను
అక్కడవిజయనగరమే వ్రాసిః జాబు రాజుకుచేరింటి
జాబులోని వర్తమానము కన్నులజూచెను
జూచి అనగ నల్లగుండు రాయిగ పగిలెను
హర్కారులపంపినాడుర విజయరామరాజు
వెనుకాముందు తోచలేదుగ రాజుగారికేమి
ఆలోచన చేసినాడు విజయరామరాజు
రెండు దినములు ఆలోచించెను విజయరామరాజు
బొబ్బిలిమీదుగ మనసువచ్చెను రాజుగారికేమి
వెంగళరాయుడి పేరిట జాబులువ్రాస్తాడు
చిన్నమాట చిత్తగింపుము వెంగళరాయుడా
మామీద కటాక్షముంచుము వెంగళరాయుడా

మాకుమీరు యెన్నిపగలువున్నా వెంగళరాయుండు
పరాసువారికి మన్నువట్టియివ్వరాదు
ఇవుడు పుదుచ్చేరి యేలేవాడు ఫ్రాంచీలబూచి
మందుగుండు సామానులతోటి ఫ్రాంచివచ్చినాడు
యెదురుసేవకు రమ్మనినాకు జాబువ్రాసినాడు
వాడియొక్క భాషాయంత్రము వారికి తెలియదు
వాడుకల్లును గంజాయి తాగిదాకై పునవుంటాడు
దేహం తెలియక వుంటాడండి ఫ్రాంసీలబూచి
మీరు మేము పామీలైతే వెంగళరాయుడా
మనము యెదురుబేటికి పోదామండి వెంగళరాయుండా
మీరు మేము వకటైపోతె వెంగళరాయుండా
అక్కడ కానిపోనిమాటలవల్ల కలహంవస్తేను
పుదుచ్చేరికి తరుమకొట్టుతాము బూచిని గనుకాను
తిరుగుజాబు వ్రాయగవలెను వెంగళరాయుండూ
మామీద కటాక్షముంచుము వెంగళరాయుడా
వెనుకటి పగలు తలచవద్దు వెంగళరాయుడా
యిన్నివైనములు పలికినాడు జాబువ్రాసినాడు
జాబువ్రాసిన లకోటాలు చేతపంపాడు
జాబులుయిచ్చి బేగిరావుల చేతికిచ్చినాడూ
బొబ్బిలికైన పంపినాడుగ విజయరామరాజు
బొబ్బిలివారి దేవిడికాడ పారాలున్నారు
ఎవ్వరితాలూకా యన్నారోయి పారాచౌకీలు
రాజూగారీ తాలూకంటా వారుచెప్పినారూ
రాజుగారి తాలూకైతే యెందుకువస్తిరి

రాజుగారి పేరిట జాబులు మేము తెచ్చినాము
వెంగళరాయుడు బేటికిపోయి వరదీ తెస్తాము
గడియసేపు నిధానించుడీ హర్కారులేమి
వెంగళరాయుడి భేటికివచ్చి పారావాండ్లయితే
రాజగారిపేరిట జాబులుమీకు తెచ్చినారు
రమ్మంటారా పొమ్మంటారా మహాప్రభో నేడు
అటకాయింపు లేకుండనే రమ్మనిపలికేను
అక్కడనుంచి వచ్చినారు పారాచౌకీలు
పారారాండ్లు బాటనిచ్చిరి హర్కారులకును
వెంగళరాయుని బేటికివచ్చి జాబులుయిచ్చిరి
దండందండందండంగీకు మహాప్రభో నేడు
లకోటాలుచించినాడు జాబు చదివినాడు
జాబులోని వర్తమానము కన్నుల చూచేను
పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంశీలుబూచి
రాజమహేంద్రము జిల్లాలోనే డేరావేసినాడు
కీకరబాకర భాషాయంత్రిము ప్రాంచివారిది
కల్లును గంజాయితాగి కైపునవుంటాడు
వాళ్లు తెలియక వుంటారండి ప్రాంచీదండులు
వారివక్క భాషాయంత్రిము మనకు తెలియదు
మనపక్క భాషాయంత్రిము వారికి తెలియదు
కానిపోని మాటలవల్ల కలహంవస్తేను
పుదుచ్చేరికి తరుమగొట్టుతాము ప్రాంచినిగనుకాను
ఇన్నివైనములు వ్రాసివున్నది జాబుకులోపరాను
ఆమాటలకేచున్నాడు వెంగళరాయుడు

కలకలకలకల నవ్వినాడు వెంగళరాయుడు
రాజుగారిపౌరుషము యింతేనన్నాడు
తానుబిలిచితె తానుపోవలె బూచీభేటీకి
మమ్మపిలచితె మేముపోవలె బూచీభేటికి
తానుకొప్పుపెట్టుకొని కోటలోవున్నాడా
మూతిమీసంలేకయున్నాడ కోటలోగాను
యెక్కడలేని కోపమువచ్చె వెంగళరాయుడికి
చదువుకున్న జాబులక్కడ చించివేసినాడు
చించివేసిన జాబులక్కడ తగలపెట్టినాడు
జాబుఖ తెచ్చిన హర్కారుల చెంపలుకొట్టించి
మెడలుపట్టి నెట్టించినాడురా వెంగళరాయుడు
ఘోడుఘోడున దుఃఖమొందిరి హరాకారులేమి
అక్కడనుంచి వచ్చినారుగ హర్కారులేమి
విజయనగరము వచ్చినారుగ హర్కారులేమి
ఘోడుఘోడున దుఃఖమొందిరి హర్కారులేమి
వెంగళరాయుడి బేటికిచాలా మేమేపోతిమి
మీరువ్రాసినజాబులు వారికొలువునవుంచితిమి
మీరువ్రాసిన జాబులుగనుక వారుచదివినారు
చదువుకొన్నవో జాబులక్కడ చించివేసినారు
చించివేసిన జాబులక్కడ తగులబెట్టినారు
మమ్మును పెళ్ళుపెళ్ళున చంపలుకొట్టించి వెంగళరాయుడు
చాలచాల మాటలుమిమ్ము పొడిచియాడినాడు
ఇన్నిమాటలు పలికినారుగా హర్కారులేమి
యెక్కడలేని కోపమువచ్చె రాజుగారికేమి

కుడిమీసమే దువ్వినాడుగ గుడ్లు యెఱ్ఱ జేసి
ఇంతకాడికి వచ్చినాడా వెంగళరాయుడూ
వక్కగళితాతో లేపేస్తాచూడు బొబ్బిలికోటలూ
స్త్రీలనంతా చెరపట్టిస్తాను కోటకులోగానూ
రాజస్త్రీల పాంచికూడు తినిపించకపోను
పొట్టక్రొవ్వు పట్టివున్నాడండి వెంగళరాయూడూ
ఇన్ని వైనములు పలికినాడు విజయరామరాజు
తన్ను కొలిచే రాణువలకుతా జాబులువాసేనూ
తన లక్షాతొంబయి వేలదండుకు జాబులువ్రాసేనూ
ఆలోచన చేసినాడుగా విజయరామరాజు
వెండి బంగారం రాజా తెప్పించినాడు
బూచిగారికి వుల్పాయలె చేయిస్తున్నాడు
బంగారపు వచ్చలటోపీ చేయించినాడు
బంగారపు వచ్చలకుర్చీ తయారు చేయించి
బంగారపు తట్టనుగనుక తయారుచేయించి
బంగారపు కోడిగుడ్లను తయారుచేయించి
బంగారపు నిమ్మపండ్లుగ తయారుచేయించి
బంగారపు అరటిపండ్లుగా తయారుచేయించి
బంగారపు కోడిపుంజుల తయారుచేయించి
బంగారపు మామిడిపండ్లుగ తయారుచేయించి
బంగారు తీటపీటలుగ చేయించినాడు
వెండితట్టి వకటిగనుక చేయించినాడూ
తట్టలోపల పండ్లుఫలాదులు తానువుంచినాడు
వుల్పాయలు అన్ని యెత్తుకొనిగ వస్తువున్నాడు

లక్షాతొంబయి వేల దళముగ కదలివచ్చినాది
లక్షాతొంబయి వేలదళముతా కన్నులజూచేను
యేనుగమీద యంబారైనా కట్టించినారయా
అంబారిమీద ముత్యాలపందిరి వేయించినాడు
అంబారిలోనే కొలువైనాడు విజయరామరాజు
యేనుగమీద రణభేరిగ యెత్తించినాడు
గుఱ్ఱంమీద ఢంకాకుండలు యెత్తించినాడు
వొంటెలమీద నగారకుండ యెత్తించినాడు
రాజు లక్షాతొంబై వేల దళములతో బయలు దేరినాడు
ప్రాంచివారి డేరాలకు వస్తుయున్నాడు
రంగరంగవైభవముతోనే వస్తుయున్నాడు
రణమోరణమోయంటు రణభేరి పలికింది
ధాంధాంయని ధాంధాంయని ఢంకాపలికింది
చారుమేళమే భరతమేళమే కూచీలైనాదీ
ఈవిధంబున డేరాలకు వస్తుయున్నాడు
రాజువచ్చే వురవడి ప్రాంచి చూచినాడు
టోపీతీసి చేతపట్టుకొని ప్రాంచిదొరగారూ
వంగి మూడు కూల్మీనులుచేసే ప్రాంచిదొరగారూ
యెదురుసేవకే ఏడుయడుగులే ముందునడిచినాడూ
అంబారి డిగ్గినాడుగా విజయరామరాజూ
రాజుగారు ప్రాంచిగారూ సంతోషపడినారూ
చెయ్యిచెయ్యి పట్టుకొని డేరాకువస్తారూ
ప్రాంచివారికి రాజుగారికి కౌగలింపులాయె
అప్పుడు ప్రాంచివారికి పచ్చలకుర్చీ వేయించినాడు

కుర్చీలమీదనే కొలువైనాడు పాంచిదొరగారూ
ప్రాంచివారి యెదురుగానే కుర్చీ వేయించి
తెచ్చినయొక్క వుల్పాయలే కొలువునవుంచికీ
సన్నబియ్యమే చాయపప్పగా కొలువునయుంచేనూ
వేటపోతులె కోళ్ళకావిళ్లె కొలువునయుంచేనూ
భూతపిల్లి బుక్కాయిపెట్టె బూసికిమేలౌను
బంగారంపు కోడిపుంజుల కొలువున యుంచేనూ
బంగారంపు కోడిగుడ్లను కొలువునయుంచేనూ
బంగారంపు ఆవుతరువుల కొలువునయుంచేనూ
బంగారంపు యేనుగుగున్నల కొలువునయుంచేనూ
బంగారంపు నిమ్మపండ్లు కొలువునవుంచేనూ
బంగారంపు పనసపండ్లు కొలువునవుంచేనూ
తెచ్చినవొక్క వుల్పాయలన్ని కొలువున వుంచేనూ
వుల్పాయలచూచినాడుగ పాంచిదొరగారూ
వుల్పాయల చూచినాడుగ కలవరపోయినాడు
నీవంటి సరదారిబిడ్డకు తగునుఅన్నాడూ
పేరైన సరదారిబిడ్డవు విజయరామరాజా
పరాకులేకవినండిమీరు విజయరామరాజా
పేరైన వుల్పాయల రాజా నాకేయిస్తీవీ
తిరిగియేమి వుల్పాయలైన మీకేయిచ్చేదీ
తూర్పుదేశం చూడనురాజా నేనేవస్త్రీని
ఇంతేగాని యితరములేదు విజయరామరాజా
ఈవిధంబుగా చెప్పినాడుగ పాంచీదొరగారు
అప్పుడేమనిపలికినాడయ్యా విజయరామరాజా

పరాకులేక వినండిమీరు ప్రాంచీదొరగారూ
మీవక్క వుల్వాయలు రాజా నాకేమీఃద్ద డీ
ఏమియిచ్చిన నిల్వ్వపోదురా ప్రాంచీదొరగారూ
మామీద కటాక్షముంచుము పాంఛీదొరగారూ
యల్ల సదరున వున్నారండి బొబ్బిలికోటాలు
సాద్యానికి రాకవున్నది బొబ్బిలికోటాలు
మదోన్మత్తులై వున్నారండి బొబ్బిలిదొరలేమి
దివాణమంటే దికావులేదు బొబ్బిలిదొరలేమి
పొట్టకొవ్వుమరిపట్టివున్నది బొబ్బిలిదొరలాకూ
బొబ్బిలికోట పర్మానాలే నాకేయివ్వండి
బొబ్బిలికోటవుల్వాయలె నాకేయివ్వండి
ఈవిధంబున చెప్పినాడు విజయరామరాజు
రాజుమాటలె విన్నారండీ పాంశీలబూచి
పలుకలేదు మాటలాడగలేదు ప్రాంశీదొరగారూ
బూచిగారివో మొగముచూచెను విజయరామరాజూ
రెండువేలపరహాలైన నజరుబోసినాడూ
వరహాలైన కన్నులచూచే ప్రాంశీదొరగారూ
బొబ్బిలికోట పర్మానాలు వ్రాసియిచ్చేనూ
అక్కడినుండిరాణువలంతా బయలుదేరినారు
రాజుగారు బూచీగారు హామీలైనారూ
అప్పుడేమని పలికినాడురా విజయరామరాజూ
తన్నుగొలిచే రాణువలంతా తానుపిలినాడూ
తనలష్కా తొంబై వేలదళముతో తానేవచ్చేనూ
ఇరువై నాలుగు వేలదళముతో బూచీవచ్చేనూ

బూచియిరువై నాలుగు వేల దళముతో ప్రయాణమైనాడు
తనమందిమూర్బలమును వెంటతీసుకోని
బూచిగారు రాజుగారు బొబ్బిలికొస్తాహూ
అప్పుడు కిటకిట మంటాదండేవస్తాది
ఈవిధంబున వస్తున్నాడు బొబ్బిలికోటకూ
వారికథలు యీలాగున్నది అవకాపల్లెలోనూ
బొబ్బిలియేలే రంగయ్యా యేలాగున్నాడు
జాబువచ్చిన మొదలుకోనిగా రంగయ్యాదొరగారు
రాజుగారిని నమ్మలేకనే రంగయ్యాదొరగాహూ
వక్కనాటి సమయమందున రంగయ్యాదొరగారు
నిండుకొలువైనాడు ప్రభువు రంగారావూ
తన్నుకొల్చే రాణువలంతా కొలువునయున్నారు
తాండ్రవారి పాపారాయుడు కొలువునలేడండీ
అప్పుడేమని పలికినాడుగ ప్రభువు రంగరావూ
ఇద్దరివక్క హర్కారులను కొలువుకు పిలిపించి
తాండ్రవారి పాపారాయుడు కొలువుకు రాలేదూ
తాండ్రవారి పాపారాయుని కొలువుకు పిలువండీ
ఈవిధంబుగ పలికినాడుగ ప్రభువురంగారావూ
వరుగువరున వచ్చినారుగ హర్కారులేమీ
పాపారాయుని బేటికివచ్చి దండంబెట్టిరి
వరాకులేక వినండిమీరు పాపారాయూడూ
మీబావగారు రంగయ్యపిలువమన్నారు
ఈవిధంబున పలికినారుగ హర్కారులేమీ
చదురుదిగ్గున లేచినాడయ్యా పాపారాయుండూ

కూర్మిమచ్చల పల్లకిలోను కొలువుతీరినాడు
పన్నెండుమంది గొలుబోయీలు పాలకిబట్టిరి
నిండుకొలువుకేవచ్చినాడూగా పాపారాయుండూ
రంగారాయుడీ చేటికివచ్చి పాలకిడిగ్గేను
పాలకిడిగ్గి కొలువుకువచ్చె పాపారాయుండూ
వందనమయ్యా వందనమయ్యా మహాప్రభో నేను
నన్నుపిలిచిన కారణమేమి తెలియాచెప్పండి
ఈవిధంబున పలికినాడుగ పాపారాయుండు
వరాకుతేక వినండిమీరు పాపారాయుడా
వుమచ్చేరి కావురస్తాను ఫ్రాంచిదొరగారు
తూర్పుదేశంచూసను రాజా వస్తువున్నాడు
రాజారంపై బాటల్లోకి తానాపొన్నండి
మిమ్మగొలిచే రాణువలంతా వెంటపిలుచుకొని
సలహాసమ్మతిమాటలమీద వెనక్కుబంపండి
కానిపోని మాటలమీద కలహానువస్తేను
నల్లయెటిలో నాల్సైనా గోరిపెట్టండి
త్వరగారాజారంపు కోటలోనికి తానాపొన్నండి
జావిధంబుగా పలికినాడు రంగయ్యదొరగారు
అచ్చటనుంచి బయలుదేరెను పాపారాయుడు
తన్నుకొలిచే రాణువలంత వెంటతీసుకొని
రాజారంపుబాటల్లోకి పోతువున్నాడు
పాపయ్యాకే శల్యాలు యిచ్చె ప్రభువురంగారావు
పన్నెండుమంది తెలగలానె తానుబిలచినాడు
పన్నెండుమంది తెల్గాలయిన కొలవుకువచ్చిరి

మమ్ముపిలచిన కారణమేమి రంగయ్యాదొరగారూ
పుదుచ్చేరి కాపురస్తుడు ప్రాంచీలబూచి
తూర్పు దేశం చూడనురాజా వస్తువున్నాడు
ఈవిధంబున పలికినాడు రంగయ్యాదొరగారు
మంచిది మరిబాగన్నిరోయి తెల్లాలయితేను
వారివారి ఆయుధములుగా చేతబట్టిరి
బంటుకువన్నెండు ఆయుధాలతో ప్రయాణమయ్యారు
వీర్ల దుట్టుకు వచ్చినారుగ తెల్లాయితేను
రాజారంపు చేరినాడుగ పాపారాయుడు
రాజారములో తాయిగాను తానావున్నాడు
తన్నుగొలిచే రాణువలంత వెంటతీసుకోని
రాజారంపై బాటలోగా తానావున్నాడు
వీరికథలు యీలాగునవున్న బొబ్బిలిమీదను
ఆడ రాజమహేంద్రము జిల్లాలనుండి రాజుగారు తాను
ప్రయాణమై వస్తువున్నారు బొబ్బిలికోటకు
రాజుగారు బూచిగారు షామీలైనారు
రాజమహేంద్రము లేచినమజిలి యెక్కడదిగుతారు
నల్లగొండలో మజిలిచేరిరి ప్రాంచీదొరగారు
నల్లగొండలో లేచినమజిలి పెద్దాపురములోను
పెద్దాపురములో లేచినమజిలి యెక్కడదిగుతారు
పెద్దాపురములో లేచినమజిలి పిఠాపురములోను
పిఠాపిరములో లేచినమజిలి యెక్కడదిగుతారు
పిఠాపురములో లేచినమజిలి సామర్లకోటలోను
సామర్లకోటలో లేచినమజిలి మన్నెంమీదను

మన్నెంమీద దిగుమతులాయె ప్రాంచీదొరగారు
మన్నెంమీద డేరాలైనా వేయించినారు
విందుకొలువున కొలువైనాడు ప్రాంచీదొరగారు
అప్పుడెట్లా వున్నాడయ్యా విజయరామరాజు
బూచిగారి బేటికిరాజా వస్తువున్నాడు
ప్రాంచీవారి బేటికివచ్చి సలాముచేసేను
అప్పుడేమని పలుకుతాడురా విజయరామరాజు
పరాకులేక వినండిమీరు ప్రాంచీదొరగారు
మన్నెంమీద పోతేబొబ్బిలి మూడామడవుంది
మన్నెంతిరిగి పోతేబొబ్బిలి ఆరామడవుంది
అట్లాపోదామా ఇట్లాపోదామా ప్రాంచిదొరగారు
పరాకులేకవినండిమీరు విజయరామరాజు
మన్నెం తిరిగిపోదామండి విజయరామరాజు
యీవిధంబున పలికినాడు ప్రెంచీదొరగారు
అప్పుడేమని పలికినాడు ప్రెంచిదొరగారు
మన్నెంతిరిగి పోగూడదు ప్రెంచిదొరగారు
తాండ్రివారి పాపారాయుడు తానావున్నాడు
రాజారంపై బాటల్లో తానావున్నాడు
రాజామనల నిలువనివ్వడు పాపారాయుడు
నల్లయేరుదాటనివ్వడు పాపారాయుడు
అడవిబాటగపోదామనగ ప్రాంచిదొరగారు
ఈవిధంబునపలికినాడు విజయరామరాజు
అయితేమంచిది మరిబాగన్నాడు ప్రాంచీబూచి
అప్పుడెట్లావున్నాడయ్యా విజయరామరాజు

తన్నుకొలిచే రాణువలంతా తానుబిలచినాడు
అన్నలార తమ్ములార మాయన్నలార
దండుకుమన మబేదారుగ జగన్నాధరాజు
కాకర్లపూడి జగన్నాధరాజును కొలువుకుపిలువండి
నిండుకొలువుకై పిలువమన్నారు హార్కారులేమి
మంచిది మరిబాగన్నారు హార్కారులపుడుదా
వందనమయ్యా వందనమయ్యా జగన్నాధరావు
రాజుగారు పిల్వమన్నారు జగన్నాధరాజు
ఇన్నిమాటలు విన్నాడయ్యా జగన్నాధరావు
తన్నుగొలిచే రాణువలంతయు వెంటతీసుకొని
రాజుగారి కొలువుకచ్చె జగన్నాధరాజు
నన్నుబిలిచినకార్యమేమి యెరుగబల్కుము
కొందరైనాహార్కారులను వెంటతీసుకోని
అడవిబాట గొట్టించుము జగన్నాధరావు
మన్నెంమీదికి అడవిబాటలు గొట్టించుమయ్యా
మంచిదన్నాడు బాగన్నాడు జగన్నాధరావు
మూడువేల రాణువులను వెంటతీసుకొని
ముందుగానుదా మన్నెంమీదికి బాటలుత్రివ్వేను
చెట్టుపుట్టలు గొట్టెనయ్యా తాయిగయపుడుదా
గొప్పగొప్పవృక్షములంతయు గొట్టించెనయ్యా
నూలుబట్టిదా బాటలుయపుడు యేర్పరచినారూ
రాజవీధిగా గొట్టుతారయ్యా జగన్నాధరావు
యీరీతిగా బాటలుయపుడు యేర్పరచినాడు
అప్పుడేలాగున్నాడయ్యా విజయరామరాజు

కట్టివేసెను డేరాలప్పుడు గాడిబండ్లమీద
యెత్తించెను డేరాలప్పుడు యెద్దుబండ్లమీద
ఫిరంగిగుండు యెత్తించినారయ్యా అప్పుడై తేను
రాచూరి పాగబాణము బండ్లమీదవేసిరి
మున్నూరు జీనిగుఱ్ఱములు ముందుగ నిలిచెనూ
ఆవెంబడి కదిలెనయ్యా యేనుగులబారూ
ఆవెంబడి వస్తువున్నారు లాల్ఖానుడైన
ఆవెంబడి వస్తువున్నడు హైదరుజంగోజీ
ఆవెంబడి వస్తున్నది గుఱ్ఱాలగుంపై తే
ఆవెంబడి వస్తున్నది ప్రాంచీనదండవ్రుడు
ఆవెంబడి వస్తున్నాడు దుబాసి లక్ష్మన్నడు
ఆవెంబడి వస్తున్నారు రాజుల గుంపై తే

మన్నెంవిడిచి వచ్చినారు రాణువలంతానూ
అర్థరాత్రి థీకొన్నారు వీర్లతట్టూకు
వీర్లతట్టులో పన్నెండుమంది తెల్గాబిడ్డాలూ
మరచినిద్రబోతున్నారు తెల్గాబిడ్డలూ
గుఱ్ఱపుసందడి విన్నారయ్యా తెల్గాబిడ్డాలూ
పడకయిందె ధట్టిగట్టిరి తెల్గాబిడ్డాలూ
యీటెకత్తులు చేతబట్టిరి తెల్గాబిడ్డాలూ
చెట్టుయెక్కి రాజూను చూచినారయ్యా తెల్గాబిడ్డాలూ
దొంగగుఱ్ఱములు వచ్చియెప్పుడు తెట్టుకమ్మినాదీ
అన్నలార తమ్ములార మాయన్నలార వినుడూ
రంగయ్యతో చెప్పిన మనకు ఆలస్యమౌతుందీ
రామరామయని అనంతకాలము రాజ్యమేలలేమూ

జగమువుండు కాలమువరకును మనము వుండబోమూ
శ్రీరాములు యేలినట్టుగ రాజ్యమేలలేమూ
యెన్నిదినములు బ్రతికినగాని చావేగలుగూను
యిచ్చటచచ్చినవారికి యిపుడు వీరస్వర్గమూ
ధైర్యముచేసుకోని తెల్గాలు తెట్టున దూకిరీ
కలిచికలిచితీసినారయ్యా కవాతుగుజ్జమూ
వెనుకచిక్కి వస్తున్నారు పాంశీలవుడుదా
యచ్చటనుండు రాణువమీద కలపటమైనారూ
నరికినరికితోచినారయ్యా యేనుగగుంపుదా
మాప్టికులగొట్టితోసిరి ముందుగ యపుడూదా
కండలు పేగులు బైటికివచ్చి భూమినపడ్డారూ
యక్కడయుండు పారాలన్ని వెనుకవెళ్ళినాది
తెట్టులో దూకినారుగ తెలగాలై తేను
గడియాసేపు నిధానించిరి తెల్గాలై తేను
వెనుకపోయిన దండుయిపుడు ముందుకునడిచిందీ
మున్నూటికి కవాతుగుర్రము ముందుగనడిచిందీ
తెల్లకాడికి ఢీకొన్నది తరువు గుఱ్ఱమూ
గుర్రపుచవ్వుడువిన్నారయ్యా తెల్గాబిడ్డలు
పన్నెండుమంది తెల్గాబిడ్డలు తాయిగవచ్చిరీ
వొకరొకరిని హెచ్చరించిరీ తెలగాబిడ్డలు
మించివచ్చిన కార్యమిపుడు విడువకూడదన్న
చచ్చిన బ్రతికిన పేరుంటుంది వీర్ల తెట్టులోను
వెనుకముందుజూడవద్దు దండులోగానూ
దండులోగా దూకినారు తెల్లబిడ్డలూ

గుద్దిగుద్ది చంపినారయ్యా గుఱ్ఱాలగుంపూను
చేనలోను కలిపినారయ్యా గుఱ్ఱాలగుంపూను
మెడనుబట్టి పీకుమీద బాకుతో పొడిచిరీ
తెల్లకిందనే జేరనివ్వక తరుముతువున్నారూ
అప్పుడెట్లావున్నాడయ్యా హైదరుజంగోజి
వీరల తెల్లయుద్ధము యపుడు కన్నులజూచేను
గుండెలుచపుడు గుద్దుకొన్నాడు హైదరుజంగోజీ
ఫ్రాంచివారి బేటికివచ్చె హైదరుజంగోజి
వీర్ల తెట్టుయుద్ధమిపుడు జరుగుచుయున్నాది
పన్నెండుమంది తెల్గాబిడ్డలు కాయిగవుండారు
యిక యేమున్నది యిక యేమున్నది ఫ్రాంచీదొరగారూ
యనేక దండు హతమైపోయెను ఫ్రాంచీదొరగారు.

గెట్టివారట గెట్టివారట తెలగాబిడ్డలూ
జయించజాలము జయించజాలము వీర్ల తెల్లలోను
మూడుపుట్ల కల్లమందుకే శెల్వులుయివ్వండి
సద్దుచప్పుడులేకుండా తెల్లముంచుదామూ
రాత్రిపూటనే చేరుదాము బొబ్బిలికైతేను
యీలాగు యడుగసాగెను హైదరుజంగోజీ
మూడుపుట్ల కల్లమందుకే సెలవుయిచ్చేను
కల్లముతోడి పూడిపించెను హైదరుజంగోజి
నాలుగుప్రక్కల వత్తులతాళ్ళు సొంపుగబెట్టిరి
వత్తులుబెట్టేజాతులవారు వెంబడియున్నారూ
మున్నూరు కవాతుగుఱ్ఱములు ముందుగనడిచేనూ
గుఱ్ఱమని దూకినారు తెలగాబిడ్డలూ

నాలుగుపక్కల దిప్పినారుగ కవాతుగుఱ్ఱమూ
తెలియకవచ్చి నల్లమందున గొబ్బున పడ్డారూ
నాలుగుపక్కల మందులవాళ్లు అంటించినారూ
భగ్గుభగ్గున రగిలినారయ్యా ధూళికపోగాను
మలమలయని మాడినారయ్యా తెల్లాబిడ్డలూ
నల్లమందుకే ధూళియైరి తెలగాబిడ్డలూ
రాత్రివేళ యొక్క వేళలో తెల్లుముంచిరి
రాత్రివేళ యొకవ్వుడే బొబ్బిలికమ్మరీ
శక్తిబాణము యెత్తివిడిచెను జాబిరెల్లికాడూ
పాయకరాముని పేటలోపల శరాళిడేరాలు
అడవిబాటలో దిగినాడయ్యా హోనావెళ్ళినాడా
మల్లమ్మదేవి చెరువుమీద మందుపెట్టుతాడా
వెంగళరాయుడు వనమునందు యేనుగుల గుంపుదా
పచ్చాబండా రేవులకాడ లాలుఖాన్డేన
మంచినీళ్ళ బావులకాడ దుబాసిలత్తుమయ్యా
పాతబొబ్బిలి పాటిమీదనే పాగించిదిగేను
కొల్లపల్లికో నేటిలో రాజుడేరాదా
వచ్చేలస్కరు వస్తువున్నది రాణువలంతాను
ఈరీతిగ దిగినారయ్యా రాణువలంతాను
యెటుప్రక్క జూచినగాని డేరాలుండేనూ
నువ్వులుచల్లిన రాలదయ్యా దండుకులోగాను
యీరీతిగానున్నాదయ్యా కోటకులోగాను
అన్నిదళములు వచ్చియప్పుడు బొబ్మలికమ్మిందీ
మొండతగలక యెత్తినారయ్యా యెరాడ్రిడేరాలు

మంచుతగలక యెత్తినారయ్యా మైనపుడేరాలు
డేరాలోపల కొలువై యున్నారు ప్రాంచిదొరగారు
అప్పుడెట్లావున్నాడయ్యా ప్రాంచిదొరగారు
ప్రాంచివారి దండికోడిజా యెత్తించినారూ
రాజుగారి తెల్లజండా యెత్తించినారూ
రాజుగారు డేరాలోపల కొలువై యున్నారు
నిమిషంబుదా ఆలోచించెను విజయరామరాజు
ప్రాంచివారిడేరాకుదా అప్పుడువచ్చెను
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజూ
చిన్నపలుకులు చిత్తగించుము ప్రాంచిదొరగారు
కోటకమ్మన సంగతియప్పుడు రంగయ్యకై తెలు
బొబ్బిలికోట రంగయ్యాపు యెరుక చేస్తామయ్యా
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
ఆలాగేచేయమనెను ప్రాంచిదొరగారూ
పెద్దలనాటి నగారబల్ల చేతబట్టినాడూ
ధాంధాంధాంధాం మని ధంకాపలికేను
రణమురణము రణమంటూ నగారపలికింది
ప్రాంచివారి బుంజాలుపాటలు పాటలుపాడింది
అప్పుడెట్లావున్నారయ్యా బొబ్బిలిదొరలూదా
చంద్రశాల మండపమున రంగయ్యాదొరగారు
వగడశాలయు ఆడినవెనుక సాముకుపోదాము
సాముకుబోవు సమయమందు శబ్దమువిన్నాడు
తమ్ముడియొక్క చంద్రశాలకే తానువచ్చినాడూ
తట్టితట్టి లేపినాడయ్యా వెంగళరాయుణ్ని

కలవరపడి లేచినాడయ్యా వెంగళరాయుఁడు
వందనమయ్యా వందనమయ్యా రంగయ్యాదొరగారూ
యెన్నడురానివారు యిప్పుడు యేలవస్తిరి
వేళకాని వేళయందు కోటకువస్తిరీ
యేమిఅపాయం జెందెనయ్యా వీరబొబ్బిలీకి
మీరువచ్చిన కార్యమేమి తెలియజెప్పుమయ్యా
ఈరీతిగా పలికినాడు వెంగళరాయుండు
అప్పుడురంగయ్యా యేమంటాడు వెంగళరాయునితో
యేమిజెప్పుదు యేమిజెప్పుదు వెంగళరాయుడా
సాయంత్రంవేళ కోటక్రిందికి సవారిపోతిని
సద్దుచప్పుడు లేదయ్యా కోటలక్రిందాను
చంద్రిసాల మంటపములో వెంగళరాయూడా
పగడసాల ఆడినేను సాముకుతోలితిని
అప్పుడు మన కోటలక్రింద నగారపలికిందీ
నగారశబ్దము యెక్కడిదయ్యా వెంగళరాయూడా
యిట్టిశబ్దము యెక్కడిదయ్యా వెంగళరాయూడా
పరాకుంచక వినుము యిప్పుడు అన్నయ్యాదొరగారు
ఈరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు
రణభేరి శబ్దముగాదు రంగయ్యాదొరగారు
మల్లమ్మదేవి చెరువుక్రింద కాపులవారుదా
కందులు విత్తులు చాలజల్లిరి అన్నయ్యాదొరగారు
చేనుకాడ పిల్లకాయలు తుడుములు కొట్టినారు
యీయీరీతిగా. చెప్పినాడయ్యా వెంగళరాయుఁడు
ఆమాటకు తాళజాలక రంగయ్యాదొరగారు

తుడుములుకాదు తుమ్మెలుకాదు వెంగళరాయుడా
నగారశబ్దము వింటివయ్యా వెంగళరాయుడా
ఈరీతిగా చెప్పినాడు రంగయ్యదొరగారు
పరాపంచక వినుమయిప్పుడు వెంగళరాయుడా
తమ్మునిమాటలు నమ్మలేకనే అన్నయ్యదొరగారూ
అనంతబురుజు యెక్కిజూశాము వెంగళరాయుడా
ఈరీతిగా చెప్పినారు రంగయ్యదొరగారు
చెయ్యిచెయ్యిలో ముట్టడించి వస్తువున్నారు
అనంతబురుజు యెక్కిరప్పుడు అన్నదమ్ములూ
జోడుకుర్చి లచ్చటయుప్పుడు వేయించినారు
కుర్చిమీద కొలువుతీరిరి అన్నాదమ్ములూ
తెల్లవార వచ్చినదయ్యా బొబ్బిలిమీదాను
మల్లమ్మదేవి చెరువుప్రక్క కన్నులచూచేను
పరాకులేక వినుముయిప్పుడు అన్నయ్యదొరగారు
పడమటిచేను ఆవులగుంపు పట్నంపోతాదీ
కట్టమీదనే మేతమేసి నిలిచియున్నాది
కోటలక్రింద రంతుయేమి వెంగళరాయుడా
వుత్తరాది గొఱ్ఱెలగుంపు పట్నంపోతాది
కోటచుట్టు మేతలుమేసి నిలచియున్నాదీ
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారూ
పాతబొబ్బిలి పాటిమీదనే గుంపులు యేమయ్యా
చుట్టుప్రక్కల నుండెడిదున్నపోతులు పట్నంపోతుంది
పాతబొబ్బిలి పాటిమీదనే కంచెలువున్నాది

కంచెలుమేసి పాటిమీదనే నిమ్మళించినాది
ఇందాక యికయేమిలేదు అన్నయ్యాదొరగారూ
తెల్లవారే ప్రొద్దుబుట్టెను బొబ్బిలిమీదాను
నాలుగువైక్కాల పారాజూచెను రంగయ్యాదొరగారూ
ప్రాంచివారి తెల్లజండా కన్నులజూచేను
యెటువైక్కు జూచినగాని యేనుగగుంపుదా
యెటువైక్కు జూచినగాని గుఱ్ఱాలగుంపుదా
సందుబొందు జూచినగాని సానకత్తులూ
తత్తరించినున్నాడయ్యా దండుకుయపుడుదా
అప్పుడేమని చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారూ
పరాకుంచక వినుమూ యిప్పుడు వెంగళరాయూడా
పోరులేని బొబ్బిలిమీద పోరుగలిగింది
పెద్దలనాటీ బొబ్బలికిపుడు భోగము చెల్లింది
ఇక్కడయుండ దగదయ్యా బొబ్బలికోటాలో
రాజుగారితో మనము జయించజాలామూ.
నల్లమందు గుండుతోను ప్రాంచివచ్చినాడూ
నల్లమందు గుండుకుముందు కత్తియెత్తరాదూ
కోటలకంతా కోరసింహాము పాపారాయూడూ
రాజాయిచ్చట వచ్చునని బాట కాచియున్నాడూ
దొంగతోవల బాటలజూచి తానువచ్చినాడు
పాపారాయుడు యుంటేమనకు భయములేదయ్యా
తలుపు తెరచి జడసినట్లయీ బొబ్బిలికోటాకు
పాలుకోలు ముండ్యాలు మనము బాగుచేసుకోని
రాజస్త్రీల పిలుచుకొని వల్సలు బోదామూ

వెనుకవచ్చి చెంపలుకొట్టి బొబ్బిలితీతామూ
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు
అన్నమాటలు విన్నాడయ్యా వెంగళరాయుండు
యెక్కడలేని కోపమువచ్చెను వెంగళరాయుడికి
మండివేసి కొలువుదీరెను వెంగళరాయుండు
హింసమాటలు పల్కవద్దు అన్నయ్యాదొరగారు
భీతియిప్పుడు యుంచవద్దు అన్నయ్యాదొరగారూ
రాజస్త్రీలతీసుకోని వల్సలుబోతేనూ
పడమటిసీమల యెలమాలెల్ల నవ్వారవింటేనూ
చుట్టుప్రక్కల రాజులువింటే హేళనముగాదయ్యా
మానముపోయిన పిమ్మటయిట్టి ప్రాణమెందుకయ్యా
రామరామ యనంతకాలము రాజ్యమేలుతామూ
జగమువుండు కాలమువరకు వుండలేముమనము
కొన్నిదినములు బ్రతికినగాని చావుసిద్ధమానే
ఆపత్తయిన వచ్చిన యపుడు అన్నయ్యా దొరగారూ
ధైర్యమింతయు విడువరాదు అన్నయ్యాదొరగారూ
పిరికిమాటలుబలుకవద్దు అన్నయ్యాదొరగారూ
పరాకుంచక వినుముయిప్పుడు అన్నయ్యాదొరగారు
చాలుచాలు నీదుమాటలు అన్నయ్యాదొరగారూ
రెండుఘడియలు సెలవిచ్చి నా తమాషచూడండి
పన్నెండేండ్లు సాముచేసితి సాధనగరిడీలో
సాముజేసిన రెట్టలకిపుడు బలమూకలిగిందీ
లాయమునందుండు బారా తేజికి సవారిగలిగిందీ
తుపాకిబట్టిన పట్టాకత్తులు తుపాకులు వదిలి-దీ

మొలనుయుండు పచ్చలబాకు బరుసిన బెరికేనూ
ఉడానువేసి భూమినదూకెను వెంగళరాయుండూ
తమ్ముని యొక్క కోపమునుతా కన్నులచూచేను
కౌగలించి పట్టినాడయ్యా వెంగళరాయూడా
తామసించుము తామసించుము వెంగళరాయూడా
అవసరవడితె పనులుకాదుర వెంగళరాయూడా
దామర్ల వారి ధర్మారాయుని సంధికి పంపితే
రాయబారము తీర్చికొనిదా రాయుడువస్తాడు
రాయబారము కుదురకపోతే పిమ్మటచూతాము
ఈరీతిగా పలికినాడయ్యా రంగయ్యా దొరగారూ
పరాకుంచక వినుముయిప్పుడు అన్నయ్యాదొరగారూ
అచ్చటినుండి వస్తున్నారు అన్నదమ్ములూను
తన్నగోత్ర రాజులంతా కొలువుకువచ్చేను
బండిరి రామారాయుడు కొలువుకువచ్చేను
ముత్యాలవారి పాపారాయుడు కొలువుకువచ్చేను
పటాలవారి రామన్నయు కొలువుకువచ్చేను
దామర్ల వారి ధర్మారాయుడు కొలువుకురాలేదు
పిలువుమయ్యా పిలువుమయ్యా ధర్మారాయున్ని
ఈలాగునచెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు
హర్కారులను పిలిచినాడయ్యా రంగయ్యాదొరగారు
ధర్మారాయుడు బేటికివచ్చి హర్కారులవుడు
వందనమయ్యా వందనమయ్యా ధర్మారాయుడా
బావగారు రంగయ్యానిన్ను పిలువుచున్నారు
ఈరీతిగ చెప్పినారయ్యా హర్కారులవుడూదా

యెందుకునన్ను పిలువమన్నాడు బావగారిపుడుదా
అట్లుచెప్పుతు బయలుదేరెను ధర్మారాయుండు
బావగారి ముందుగవచ్చి వందనమొసగేను
యేలనన్ను పిలిచినారుగ బావగారిపుడుదా
అప్పుడేమని చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు
యేమనగాను యేమనిచెప్పుదు ధర్మారాయుండా
రాజుగారికి మనకునిండా పగలూగలిగేను
తూర్పుదేశము చూడనయిపుడు ప్రాంచివచ్చినాడు
పుదుచ్చేరి యేలేటివాడు ప్రాంచిదొరగారు
ఇరువైనాలుగు వేలదండుతో ప్రాంచివచ్చేను
రాజుగారి ప్రాంచీదొర తాకీదంపేను
యెదురుసేవకే రమ్మని తాకీదంపేను
తాకీదపుడు జూచికొన్నడు విజయరామరాజూ
వెంగళరాయుని పేరట యిపుడు జాబువ్రాసేను
జాబులయపుడు చేతికిచ్చేను వెంగళరాయుడికి
జాబులోని సంగతులన్ని కన్నులజూచేనూ
చదివినయట్టి జాబులను చింపివేసినాడు
చింపినట్టి జాబులను తగలబెట్టినాడు
జాబుదెచ్చినహర్కారులను చెంపలుగొట్టినాడు
మెడనుబట్టి వారిని తోచెను వెంగళరాయుండు
ఘోడుఘోడున దుఃఖపడిరి హర్కారులపుడుదా
విజయనగరము చేరిరయ్యా హర్కారులపుడుదా
ఈసంగతులు రాజుగారితో మనవిచేసినారు
రాజుగారు కోపముజెందె యట్టివేళలోను

కోటమీదికి దండు తెచ్చెను విజయరామరాజూ
దేశము తెలియని ఫ్రాంచిగారు దేశముపై వచ్చిరి
నల్లమందు గుండుతోను ఫ్రాంచివచ్చినాడు
నల్లమందుతోను పోట్లాడుతారు ఫ్రాంచీదొరలూదా
రాజుతో మనము యెందులకైన పోరాడగలము
నల్లమందు గుండుకు మనము ముందునిల్వలేమూ
రాయబారము పోవలెనయ్యా ధర్మారాయూడ
ఆమాటకే కోపముజెందె ధర్మారాయుండు
వెంట్రుకలంత గద్దరించె రాయుడికై తేను
చాలుచాలు నిలువుమయ్యా రంగయ్యాదొరగారు
వూసపాటి బేటికినన్ను పొమ్మనియంటారా
ప్రాణముతోను రాజుబేటికి నేనుపోనయ్యా
యుద్ధమునకు పొమ్మంటేను నేనుపోతాను
యింతపనిదా జేతును బావయ్యాదొరగారు
యిట్టిమాటలు చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యాదొరగారూ
పరాకుంచక వినుముయిప్పుడు ధర్మారాయూడ
రాజుగారి బేటికినీవు యిపుడేపోవద్దు
ఫ్రాంచివారి డేరావద్దికి నీవేపోవయ్యా
రాయబారము చెప్పినీవు రాయిగరన్నండీ
యిన్నిమాటలు చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
పరాకుంచక వినుము యిపుడు రంగయ్యాదొరగారు
కీశరభాశర భాషాలైతే ఫ్రాంచీవారిదీ

కల్లుసారాయి తాగివారు కైపునవుంటారు
తూగివడుతూ యుంటాడయ్యా ఫ్రాంచిదొరగారు
సంధిమాటలు యేలాగున చెప్పివత్తునయ్యా
యీలాగున చెప్పినాడయ్యా ధర్మారాయుండు
పరాకుంచక వినుము యిప్పుడు ధర్మారాయుండు
బందరులోని కాపురస్తుడు దుబాసిలక్షుమయ్యా
నాలుగుచదువులు చదివినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
లక్షుమయ్యాడేరావద్దకు సంధికిపొన్నండి
యింతపైకము అడిగినాడని వెనుకతియ్యావద్దు
యిచ్చాటమీరు వచ్చినందులకు లక్షలుయిస్తాము
మజిలీయొకటికి లక్షపైకము మేమేయిస్తామూ
మందుసెలవులు సిబ్బందిసెలవులు మేమేయిస్తామూ
నల్లమందు సారాయి శెలవులు యినాము యిస్తామూ
అంబారిగట్టిగ యేనుగయినాము మేమేయిస్తాము
పొమ్మంటేను మండ్యాలభూమికి యివ్వాడెపోతామూ
కార్యమందు వంచనలేదు బొబ్బిలివారికి
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలివారీని
పసిబిడ్డలు బాలింతలతో కోటలోయున్నామూ
ముసలిముతకలతోను మేము కోటలోయున్నామూ
రాజుమాటలు వినేదిమీకు న్యాయము కాదయ్యా
రాజుగారికి మాకుచాలా పగలుయున్నాది
పెద్దలనాటి పగలుమాకు పెరుగుతుయున్నాది
మాకుమీకు తగవులేదయ్యా దుబాసిలక్షుమయ్యా
తూర్పుదేశము చూడనుయిపుడు మీరేవస్తిరే

కర్నాటక రాజులతోను కలహము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతి కోటకుపొన్నండి
ఈతూరిమన్నించుము బొబ్బిలికోటాను
మేముయిచ్చేవుల్వాలన్ని మీరుతీసుకోని
ఈరీతిగాచెప్పమయ్యా ధర్మారాయుడా
రాయబారము కుదరకపోతే పిమ్మటజూతాము
శెలవుపొందివస్తున్నాడు ధర్మారాయుండు
తులసినందనవనములోకి కదలివచ్చినారు
నందనవనములో చల్లగాను తీర్థమాడినారు
ఆరుఘడియలు అంజపూజ మూడుగళ్లుజేసె
హరిపూజ శివపూజలన్ని తానుతీర్చుకోని
పట్టుకోటలో గోపాలస్వామిని మదిలోదలచేను
రాజుదివాణము వచ్చినాడయ్యా ధర్మారాయుండు
పంచభక్షపరమాన్నముతోను అన్నము తినెను
విడియములపుడు చేతికందెను ధర్మారాయుడికి
తన్నుగొలిచె రాణువలంత తానుబిలిచినాడు
అన్నలార తమ్ములార ఎల్మాబిడ్డలూ
ప్రాంచివారి డేరావద్దకు సంధికిబోదాము
నాతోకూడ రావలెనయ్యా ఎల్మాబిడ్డలు
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
మంచిదన్నారు బాగన్నారు ఎల్మాబిడ్డలు
వారివారిపిడిదికి అపుడు కదలివచ్చినారు
పంచభక్ష్య పరమాన్నముతో అన్నముతినెను
జాజిపువ్వుల జల్లడములు జగ్గునదొడగిరి

గావిమీరిన వీరదాసులు నడుమునుగట్టిరి
వెండికట్టెలు సొగసుగవారు చేతబట్టినారు
చేతులయందున సోపుకర్రిలు సొగసుగ బట్టినారు
తాలాతట్టాకత్తులపారి సంకన వేసీరి
బంటుకు పంన్నెండాయుధములతో పరియాణమైనారు
ధర్మారాయుడు బేటికివారు పరుగునవచ్చిరి
వందనమయ్యా వందనమయ్యా ధర్మారాయుడా
తామసంబు యింకాయేల తయారుగన్నండీ
ఈరీతిగా చెప్పినారూ ఎల్మాబిడ్డలు
ఎల్మాబిడ్డల శృంగారింపుదా కన్నుల జూచేను
ఘల్లుమని నవ్వినాడు ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
భారా తేజిని యిపుడుమీరు బేటికి తెన్నండి
నేలమిద్దెలో భూమికావులో తేజివున్నాది
శృంగారించి తీసుకరండి కొలువుకుయిప్పుడూ
ఈరీతిగా వెప్పినాడు ధర్మారాయుండు
పన్నెండుమంది కావుదారులు గొబ్బునవచ్చిరి
వేసినారయ్యా తేజికక్కడ వెండికళ్ళెములు
జడలుఅల్లి జుట్లుగుండుల సొంపుగ వేసిరి
మెడమీదజుట్టె గుండ్లుసొంపుగ అల్లియున్నారు
ఉమాయిపీట కలికితురాయి చందమామచెక్కి
పట్టుతాళ్ళతో గట్టినారయ్యా బారా తేజిని
తేజియొక్క శృంగారమే కన్నులచూచేను
పాదములకు పూజించినాడు ధర్మారాయుండు

కూర్మిపచ్చల పల్లకి యపుడు బైటబెట్టినారు
పల్లకిలోపల కొలువుతీరెను ధర్మారాయుండు
పన్నెండుమంది బోయవాండ్లు పల్లకిబట్టిరి
పల్లకిప్రక్క వస్తున్నాది బారాతేజీదా
హరిరామా శ్రీరామాయంటా కోట విడిచినాయె
కోటగవినికి వచ్చినప్పుడు గోవిందబెట్టిరి
కోటదాటివచ్చినాడయ్యా ధర్మారాయుండు
కత్తులతోడ పార అపుడు తిరుగుతువున్నారూ
దొంగజేరువో పారాలన్నీ తిరుగుచుయున్నాదూ
మూడువేల ముకుండబలము పారావున్నారూ
రెండువేల సోల్జరువారు పారాయున్నారూ
నల్లమందు అనువులవద్ద పారాయున్నారూ
అనువుకాడ నేవచ్చినాడయ్యా ధర్మారాయుండు
ఆవెంబడివస్తున్నారు ఎల్మాబిడ్డలూ
ఆవెంబడివస్తున్నాది బారాతేజిదా
అనువులకాడ అటకాయించిరి ధర్మారాయున్నీ
యెవరు యెవరు మీరు యిపుడు పారాకొస్తిరీ
ఈరీతిగా అడిగినారయ్యా పారాచౌకీలు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
బొబ్బిలివారి దివానగిరి ధర్మారాయున్ని
బొబ్బిలివారి దివానమైతే యెందుకువస్తివీ
మీరువచ్చిన కార్యమేమి తెలియజెప్పుమాకూ
పోనివమయ్యా పోనివమయ్యా ధర్మారాయుడా
ప్రాంచివారి యుత్తరువులేక బాటలు విడువామూ

రాజుగారి యుత్తరువులేక బాటలుయివ్వమూ
కిటకిటకిటకిటకిటకిట పారాకమ్మిందీ
రెండువేల ముకుందబల్యాము పారా కమ్మినారు
మూడువేల ముకుందబలము పారాకమ్మినారు
పారామధ్య చిక్కినాడయ్యా ధర్మారాయుండు
అన్నలార తమ్ములార పారాచౌకీలు
యుద్ధమునకు రాలేదయ్యా పారాచౌకీలు
ఫ్రాంచివారి డేరావద్దకు సంధికిబోతాను
రాయబారము కుదిరితేను కోటకుపోతాను
రాయబారము కుదరకపోతే పారాచౌకీలు
హెచ్చరించినేనుకోటకు అప్పుడు హాయిగపోతాను
యుద్ధానికి రావలెనంటే కోటకురన్నడీ
వారివారి బలములనైతే అచ్చటజూతామూ
ఇంతేకాని యికయేమిలేదు పారాచౌకీలు
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
పోనివ్వము పోనివ్వము ధర్మారాయుండా
రాజుగారి వుత్తరువులేక దోవలు విడువాము
ఫ్రాంచివారి వుత్తరువులేక దోవలు విడువామూ
గుంపుగవచ్చి కమ్ముకున్నారు పారావారూడా
పారాలన్ని తోడుకొనిదా వస్తువున్నాడు
వారివెంబడి వస్తున్నారు మెల్మాబిడ్డలు
మెలమెలప్రక్క తిరిగిజూచె ధర్మారాయుండు
కన్నులసైగ చేసినాడయ్యా ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినారయ్యా మెల్మాదొరలును

యుద్ధమునకు రాలేదయ్యా పారాచౌకీలు
చుట్టుకమ్మిపారాలవుడు వస్తువున్నారూ
మంచినీళ్ళ బావికాడ పారాకమ్మేను
రాజుయొక్క పురవడిజూచిరి పారాచౌకీలు
అక్కడక్కడ పారాలన్ని వెనుకకు తీసిరీ
అప్పుడెట్లా వున్నాడయ్యా దుబాసిలక్షుమయ్యా
డేరాబైట కుర్చీమీద కొలువైయున్నాడు
పల్లకిమీద వచె డీరాయుని కన్నులజూచెను
వారినిచూచి దిగ్గునలేచే దుబాసిలక్షుమయ్యా
యెదురుసేవకు యేడడుగులు ముందుగనడిచేను
పల్లకిలోవల యుండేరాయుడు కన్నులచూచేను
ఉడాను వేసి భూమిలోదూకెను ధర్మారాయుండు
ఏడడుగులు ముందునడచేను ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పిగాడయ్యా దుబాసిలక్షుమయ్యా
యెవరుమీరు యెవరుమీరు డేరాకొస్తిరి
యీరీతిగా బలికినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
రంగరాయుని బావమరిదిని ధర్మారాయున్ని
మాయింటిపేరు దాదాలవారు వినుముయిపుడుదా
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుడు
యెందుకొస్తివి యేలవస్తివి ధర్మారాయుడా
దివానమెచ్చి దిగినాడంటె బేటికివస్తిమి
యీలాగు చెప్పినాడయ్యా ధర్మారాయుడు
చాలుచాలు నిలువుమాయ్యా ధర్మారాయుడా
దివాణమంటె పర్వావున్నదా బొబ్బిలిదొరలాకు

దివాణములచే భయమున్నాదా బొబ్బిలిదొరలాకు
అనకాపల్లెలో వుండీమేము జాబులు వ్రాస్తిమి
యెదటిసేవకు రమ్మనిమీాకు జాబులువ్రాస్తిమి
యెదటిసేవకు రాకపోతిరి బొబ్బిలిదొరలుదా
మీావంటి వారలకంతా జాబులు పంపితిమీా
జాబులుచూచిన తక్షణంబు ధర్మారాయుడా
యెదురుసేనకై వారలందరు యెదురుగావచ్చిరి
యీారీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
అప్పుడేమని చెప్పినాడండీ ధర్మారాయుండు
పరాకుంచక వినుముయిపుడు దుబాసిలక్షుమయ్యా
మీారువ్రాపిన జాబులైతే మాకుచేరలేదు
మీారువచ్చిన సంగతులు మాకు తెలియకపోయె
వెంగళరాయుని పెండ్లియంచు మేమువుంటిమి
నగారశబ్దము విన్నతోడనే బేటికివస్తిమి
ఢంకాశబ్దము విన్నతోడనే బేటికివస్తిమి
పరాకుంచక వినుముయిపుడు దుబాసిలక్షుమయ్యా
రాజుగారికి సిండామాకు పగలుయున్నాది
మాకుమీాకు పగలేదయ్యా దుబాసిలక్షుమయ్యా
రాజుమాటలు వినటమీాకు న్యాయముకాదయ్యా
చిన్నబిడ్డలు చీమలబారుతో కోటలోయున్నాము
కోటమీాదికి వచ్చుటమీాకు న్యాయముకాదయ్యా
ఆరులక్షల పైకము మేము అగావులిస్తాము
ఇచ్చుటవచ్చినందుకు లక్ష యినాములిస్తాము
మజిలియొక్కటికి లక్షపైకము మేముగట్టుతాము

కర్నాటకం చూడనురాజా మీారేవస్తిరి
కర్నాటకం దొరలతో గల్బయేలయ్యా
అంబారి పెద్దయేనుగు యినాము లిస్తాము
వచ్చినవారు వచ్చినరీతి పుదుచ్చేరి పొన్నండి
నేను తెచ్చినవుల్పాలంత మీారుచేకొనండి
యీాతూరి బొబ్బిలికోటను చాలామన్నించండి
యీారీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు దుబాసిలక్షుమయ్య
రాజుమాటలు ప్రాంచిమాటలు యొకటై యున్నాది
రాజుగారికిబొబ్బిలికోటకు వర్మానిచ్చేను
చెప్పితేను తప్పేదిలేదు ప్రాంచిదొరగారు
సంధికివచ్చినందుకు యేమిసారము లేదయ్యా
వచ్చినవారు వచ్చినట్టు కోటకుపొన్నండి
రాజుగారికి పట్టంగట్టి ప్రాంచిపోతారు
వెనుకవచ్చిచెంపలుకొట్టి కోటలు తీయ్యండి
ఇంతేకాని యికయేమిలేదు ధర్మారాయుడా
ఈరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
యెక్కడలేని కోపమువచ్చె ధర్మారాయుడికి
పటపటపటమని పండ్లుకొరికెను ధర్మారాయుండు
పరాకుంచక వినుమియిప్పుడు దుబాసిలక్షుమయ్యా
ఒకరిపట్నం ఒకరికియెవరు కట్టేవారలుదా
రాజమహేంద్రింజిల్లాలోనే ప్రాంచిదొరగారు
రాజుగారికి బొబ్బిలికోటలు వర్మానిచ్చేను
రాజుగారికి పట్టముగట్టి తానేపోతాడు
పుట్టినచోట చావడానికి బ్రహ్మవ్రాయలేదు

బొబ్బిలికోటలో చావడానికి వానికిక్రవా సేను
అటువంటి నీతిపురుషుడు ప్రాంచిదొరగారు
పుదుచ్చేరి యిపుడేకదా రాజుగారికైతే
రాజుగారికి ఆపట్నమె పట్టముగట్టరాదా
బొబ్బిలివారికి పట్టంగట్టి పోవచ్చినాడూ
తనలో తాను తామసించుకొని ధర్మారాయుండూ
పరాకుంచక వినుముయిప్పుడు దుబాసిలక్షుమయ్యా
వారిసిస్తేను సంతోషమాయెను దుబాసిలక్షుమయ్యా
ప్రాంచికినాకు బేటిచేయించు దుబాసిలక్షుమయ్యా
యొకటిరెండు మాటలవల్ల మాట్లాడిపోతానూ
రాయబారము కుదిరితేను కోటకుపోతానూ
యీరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండూ
ప్రాంచీకినీకు బేటిచేయిస్తేనాకేమి యిస్తావూ
ఆమాటలకే నవ్వినాడు ధర్మారాయుండు
లంచముతీసేబుద్ధులునీవు మానకపోతీవి
చేతనున్న పచ్చనికడ్డి చేతనిచ్చేనూ
రెండుసంచుల వరాలుయపుడు నజరుబోసినాడూ
యెందరుదొరలు బేటికివచ్చి యిట్లులేదయ్యా
నీవురాను భయమగుచున్నది దండుకులోగాను
పరాకుంచక వినుముయిప్పుడు ధర్మారాయుండా
కల్లుసారాయి త్రాగివారు కయిపునవుంటారూ
వాళ్ళు తెలియక మరచివుంటాడయ్యా ప్రాంచిదొరగారూ
కుర్చీమీద తూగుతువుంటాడు ప్రాంచిదొరగారూ
పాలించివారిడేరాకుబోయి నేనేవస్తాను

ఘడియసేపుదా నిధానించుము నాడేరాలోగా
మంచిదన్నాడు అప్పుడయ్యా ధర్మారాయుండూ
అచ్చటనుండి ప్రయాణమాయెను దుబాసిలక్షుమయ్యా
గరుడపక్షుల పల్లకిమీదా వస్తువున్నాడూ
ప్రాంచివారి డేరావద్ద డాకీలైనాడూ
అప్పుడెట్లావున్నాడయ్యా ప్రాంచిదొరగారూ
తీనియప్పుడు తింటున్నాడు ప్రాంచిదొరగారూ
పల్లకివిడిచి యెదురుగవచ్చెను దుబాసిలక్షుమయ్యా
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
సలామనగా టోపీయెత్తి సలాముచేసేనూ
బైటో అనగా కొలువుతీరెను దుబాసిలక్షుమయ్యా
యెందుకుయిచ్చటవచ్చినావు దుబాసిలక్షుమయ్యా
ఈరీతిగా అడిగినాడయ్యా ప్రాంచీదొరగారూ
అట్టిమాటలకు యేమన్నాడు దుబాసిలక్షుమయ్యా
పరాకుంచక వినుముయిప్పుడు ప్రాంచీదొరగారు
బొబ్బిలివారి దివాణమంటూ ధర్మారాయుండు
రాయబారమె వచ్చినాడయ్యా ధర్మారాయుండు
పచ్చలకుర్చీ వేయించుము ధర్మారాయుడికి
యెదురుసేవకు మీరునడువండి ముందుగయిపుడుదా
చెయ్యితోను చెయ్యిపట్టి డేరాకుపిలువండి
యిద్దరువొక్క కుర్చీమీద కొలువుతీరండి
ఒళ్ళుమరచి యేమాటనైన నేనుచెప్పితేను
ఓర్చియుండేడివారుకారు ధర్మారాయుండు
సరదారిబిడ్డ వాడేనయ్యా ధర్మారాయుండు

మర్యాద చేయకపోతే పాంచీదారగారూ
డేరాలోపల గోరిపెట్టి కోటకుపోతాడు
ఈరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్షుమయ్య
ఆమాటలకు యేమనిచెప్పెను పాంచిదార రూ
యెన్నిమందులు తెచ్చినారయ్యా ధర్మారాయునితో
ధర్మారాయుడు పేరుచెప్పగానే నల్లగుండెపగిలె
పరాకుంచక వినుముయిపుడు పాంచీదారగారూ
యాభైమూర్గురు యెలమలతోడ అలగవచ్చేను
ఆమాటలను విన్నాడయ్యా పాంచీదారగారూ
గడగడగడగడ గడగడవణికెను ప్రాంచిదారగారు
ఆరునిమిషంబుల తీసినాడయ్యా ఆరనిబళ్ళాగ
మూడునిమిషంబుల తీసినాడు మూడెడ్ర్గాలూ
యాభైముప్వారు ఎలమలతోడ రాయుడువస్తాడా
పరాకుంచక వినుముయిప్పుడు దుబాసిలక్షుమయ్య
అయిదుగురితో రమ్మనిచెప్ప నాడేరాలోగాను
తక్కినవారిని నీడేరాలోగా తాయిగపెట్టండి
ఈరీతిగా చెప్పినాడయ్యా పాంచిదారగారు
ఈమాటలు విన్నాసయ్యా దుబాసిలక్షుమయ్య
గరుడపచ్చల పల్లకియెక్కితాను వస్తువున్నాడు
రాయుడుబేటికి యెదుటవచ్చె దుబాసిలక్షుమయ్యా
పోయినపనులు యేరీతాయెను దుబాసిలక్షుమయ్యా
పరాకులేక వినుమయిప్పుడు ధర్మారాయుండా
పాంచివారి డేరావద్దకు నేనుపోతిని
చెప్పవలసిన మాటలన్నియు నేనేచెప్పితిని

ఐదుగురితో రమ్మన్నాడు డేరాలోగాను
కొంతమందిని నాడేరావద్ద వుంచుమన్నాడూ
ఈరీతిగా వుత్తరువు తెస్తిని ధర్మారాయుండా
సంతోషించి నిలిచెనయ్యా ధర్మారాయుండూ
యాభై మువ్వురు యల్మాదొరల ఏర్పరచినాడూ
ఇన్నూటియొక్క సరదారిబిడ్డగా యేర్పరచినాడూ
ఐదుగురు యెల్మాబిడ్డల యేర్పరచినాడూ
పరాకుంచక వినండిమీరు యెల్మాదొరలూదా
ప్రాంచివారి డేరావద్దకు సంధికిపోతానూ
నాతోకూడ రావలెనయ్యా యెల్మాదొరలుదా
అట్టిమాటలు చెప్పినాడయ్యా ధర్మారాయుండూ
ఐదుగురు యెల్మాదొరలను వెంటతీసుకోని
కూర్మికుచ్చుల పల్లకెక్కెను ధర్మారాయుండూ
పల్లకివెనక పస్తువుంది బారా తేజిదా
పల్లకివెంట కమ్మినారు యెల్మాదొరలుదా
ఈరీతిగా ప్రయాణమాయెను ధర్మారాయుండు
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అన్నలార తమ్ములారా యెల్మాబిడ్డలు
పాంచివారి డేరావద్ద నే సంధిపోతా
రాయబారము కుదిరితేను కోటకుపోదాము
కానిపోనిమాటలవల్ల కలహంవస్తేను
చేతనుండు డేగనుమీరు కోటకువిడిచిదా
కిందుమీదు చెయ్యండయ్యా ప్రాంచిడేరాలు
బాకులవల్ల డేరాలంతా తాయిగచింపండి

ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండూ
యచ్చటనుండి వస్తువున్నడు ధర్మారాయుండూ
ప్రాంచివారి గుడారంజూచి వస్తువున్నాడు
అతనివెంబడి వస్తున్నాడు దుబాసిలక్షుమయ్యా
రాయుడువచ్చే వేగముజూచె ప్రాంచిదొరగారూ
గడగడవణకి త్రోవలోనిలచె ప్రాంచిదొరగారూ
టోపియెత్తి చేతబట్టె ప్రాంచిదొరగారూ
యెదురుసేసకు యేడడుగులువచ్చె ప్రాంచిదొరగారూ
మూడుమారులు సలాముచేసే ప్రాంచిదొరగారు
అప్పుడెట్లావున్నాడయ్యా ధర్మారాయుండు
వల్లకివిడిచి ధర్మారాయుడు భూమినదూకేను
చెయ్యితో చెయ్యిబట్టి డేరాకు వచ్చేనూ
కుర్చీమీద కొల్వుదీరెను ధర్మారాయుండూ
ఆవెంబడి వస్తున్నాడు దుబాసిలక్షుమయ్యా
ధర్మయ్యకు సామీలైనాడు దుబాసిలక్షుమయ్యా
ఇంగ్లీషుతో చెప్పుతున్నాడు దుబాసిలక్షుమయ్యా
రాజుమాటవినేదిమీకు న్యాయముగాదయ్యా
రాజుగారికి బొబ్బిలివారికి పగలేయున్నాదీ
బొబ్బిలివారికి మనకేయిప్పుడు పగలు లేదండీ
పెద్దలనాటి పగలు యిప్పుడు ఊగుతువున్నాదీ
తూరుపుదేశము చూడనుయిపుడు మనమేవస్తిమీ
కర్ణాటక దొరలవద్ద కలహాము లేకుండా
వచ్చినటుల పోదమయ్యా కోటకుయిపుడుదా
బొబ్బిలియైతే యిన్నిదినములు మాకులక్షులుదా

ఆరులక్షలపై కమిప్పుడు అగావుకడుతారు
ఇక్కడ మనము వచ్చినందుకు యినాములిస్తాడు
మజిలీ మజిలీకైనా లక్షలు యినాముయిస్తాడు
సిబ్బందిఖర్చు సెలవులంతా వారేయిస్తారూ
అంబారి పెద్దయేనుగు యినాము యిస్తారు
యీతూరి మన్నించుదాము బొబ్బిలికోటదా
పరాకుంచక వినండీయిప్పుడు ప్రాంచిదొరగారు
గోల్కొండబాషా విన్నను మాటలువచ్చాను
కర్నాటక దొరలవద్ద కలహాము లేకుండా
వచ్చినవారు వచ్చినరీతిగ మనమేపోదాము
యీరీతిగా చెప్పినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారూ
పరాకుంచక వినుమయిప్పుడు దుబాసిలక్షుమయ్యా
నన్నునమ్మి వచ్చినాడు విజయరామరాజూ
రాజువద్దకు సంధికిపుడు ధర్మారాయుణ్ని
రాజుగారు ధర్మారాయుడు స్నేహితమైతేను
ఈతక్షణమే పోదమయ్యా పుదుచ్చేరికిదా
యింతేగాక యిక వేరేలేదు దుబాసిలక్షుమయ్యా
యీరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
అట్టిమాటలు తెలుసుకొన్నాడు ధర్మారాయుండు
చాలుచాలు లేచిపోవోయి ప్రాంచిదొరగారు
ప్రాణముతోను రాజువద్దకు నేనేపోనండీ
సెలవిచ్చితె సంతోషమాయె ప్రాంశీలబూచి
లషూతోంబై వేలదళముతో మీరువచ్చినారూ

యిరువైనాలుగు వేలదళముతో రాజువచ్చినాడు
యాభైమువ్వురు యెలమదొరలతో నేనువచ్చినానూ
నీమందుగుండు హర్కారలను దూరంగపెట్టండీ
అంబారి ఏనుగమీద హావుదా వన్నింతూ
హావుదాలోపల ముత్యాల వందిళ్ళు ముందుగ వేయింతు
హావుదాలోపల కొలువుఠయాండడము ప్రాంశీలబూచి
రాజుగారి సైన్యమంతా షికారుతిప్పించి
నాయొక్క సైన్యములన్ని బారుత్రిప్పించి
రాజుసైన్యమునకు నా సైన్యమునకు లడాయిపెట్టండీ
లడాయిపెట్టి తమాషయిపుడు కన్నులజూడండీ
రాజుగెలిచితె బొబ్బిలికోట రాజుకు ఇవ్వండీ
నేనుగెలిచితే విజయనగరము నాకేయివ్వండి
ఇంతేగాగ యికవేమిలేదు పాంచిదొరగారు
పరాకుంచక వినుముయిపుడు పాంచిదొరగారు
మాకుమీకు పగలులేదయ్యా పాంచిదొరగారు
రాజుమాటలు వినుటమీకు న్యాయముకాదయ్యా
కోటమీదవచ్చేదిమీకు న్యాయముకాదయ్యా
ముసలిముతకలతోటిమేము కోటలోవున్నాము
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అట్టిమాటకు యేమన్నాడు పాంచిదొరగారు
చాలుచాలు లేఓపోవోయి ధర్మారాయూడా
బెట్టుమాటలు విడువుమయ్యా ధర్మారాయుడా
నమ్మివచ్చినవానికినేను ద్రోహముచేయను
నాచేతితో వాన్నినేను పట్టికూల్చను

పాలకొండ మర్యాలభూమి దానచేసుకొని
రాజస్త్రీల తీసుకొని వల్సలుపొమ్మంటివి
రాజుగారికి పట్టముగట్టి నేనుపోతాను
అవతలవచ్చి చెంపలుగొట్టి కోటపట్టిమి
యింతేగాక యిందరేమిచేసె ధర్మారాయునికి
చెప్పితేను తప్పితేను పాలించినపువా
అట్టిమాటలకే కోపముగలిగె ధర్మారాయునికి
వెంట్రుకలంతా చెల్లించెను ధర్మారాయునికి
కుర్చీవిడచి ధర్మారాయుడు భూమిపదూకేను
చేతనున్న డేగాపట్నాను కోటకువిడిచెను
డేగలాగు దూకినాడయ్య డేరాలోగాను
డేరా టంగు తాళ్ళను యెప్పుడె తెగగొట్టినాడు
బాకుయెత్తి చేతబట్టి డేరావించిరి
వోరియిప్పుడు చెప్పినమాటలు మరల చెప్పరా
రాజస్త్రీల తీసుకొని వల్సలుపొయ్యేదా
ప్రాణముతోను పోనిస్తానా పాలించినిన్నునా
ఆడితేను తప్పేదిలేదా మీరేఅయితేను
అటువంటి సత్యవంతుడ నీవేఅయితేను
పుదుచ్చేరి రాజుగారికి పట్టము గట్టించి
నీమస్త్రీలను తీసుకొని వల్సలుపోరాదా
యొకరియిల్లు యొకరికిస్తాను యెవ్వరికొడుకువురా
నిన్ను నమ్మివచ్చినాడా విజయరామరాజు
వానితాతతండ్రులు ముందుగ హతమైపోయినారు
తుమ్మలగుంట యుద్ధమునాడు జగన్నాధరావు

లక్షాలక్షా దండులోను హతమైపోయినాది
జలుజపాటి యుద్ధమునాడు జగన్నాథరావు
ఏడువేల యేనుగులందు హతమైపోయినాది
రాజుగారికి వ్రాసియున్నాది బొబ్బిలిమీదను
బొబ్బిలివారిచే చావనువారికి పంతమున్నాది
పుట్టినచోటచావడానికి బ్రిహ్మవ్రాయలేదు
లెట్టుకోటను బలియిచ్చెదను రాజుగారినిజా
వన్నెండేడులు సాముచేసితి సాధుగరిడీలో
లాయమందున్న బారాతేజికి లగువులుచిక్కిండి
తుపాకుపట్టిన పట్టాకత్తికి తుపాకులు వదిలింది
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
మొలనున్న పచ్చలబాకు జబ్బునదీసేను
కూసినకూత మరలయిప్పుడు కూయరప్రాంచీవా
కూసిననోరు కూయకుండ నోటినపొడుస్తాను
కత్తిమెరుపులే మెరిపించెను ధర్మారాయుండు
అప్పుడెట్లామన్నాడయ్యా ప్రాంచిదొరగారు
ధర్మారాయుడి కత్తిమెరుపులే కన్నులచూచేను
కత్తిమెరుపులే కన్నులచూచి కలవరపడినాడు
దిగులుజెంది నిలిచినాడయ్యా ప్రాంచి దొరగారు
కుర్చీవిడిచి ప్రాంచిదొరగారు గొబ్బునదూకేను
డేరాస్తంభము మరుగునబోయెను ప్రాంచిదొరగారు
అప్పుడేమని చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్య
నమ్మితినయ్యా నమ్మితినయ్యా దుబాసిలక్ష్మయ్యా
క్రోరు పులినీ తెచ్చి నీవుయీ డేరాలోబెట్టితివి

నాదుప్రాణము తప్పించరా దుబాసిలక్ష్మడా
మూడుపల్లెలు యినాములిచ్చెద దుబాసిలక్ష్మడా
యీలాగున ఇంగిలీషుతో ప్రాంచిచెప్పెను
ఈమాటలనూ విన్నాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
కుర్చీవిడిచి లక్ష్మయ్యా గొబ్బునదూకెను
గొబ్బునబోయి బట్టినాడయ్యా ధర్మారాయున్ని
చేతకత్తిని బట్టినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
తామసించకుము నిదానించుమురా ధర్మారాయుండా
యెప్పటివలెనే బొబ్బిలికోటలో డాగియున్నాడు
కపటమాటలు చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
యెత్తినకత్తి దిండుమీదనే తాయిగపోడిచేను
చదురువిడిచి లేచినాడయ్యా ధర్మారాయుండు
డేరావిడిచి బైటికొచ్చెను ధర్మారాయుండు
యాబైముగ్గురు యెల్మాదొరలను వెంటనెపిలచెను
అప్పుడేమని చెప్పినాడయ్యా దుబాసిలక్ష్మయ్యా
పరాకుంచక వినుముయిప్పుడు ధర్మారాయుడా
కల్లుసారాయి తాగివారు కైపునప్పుటాను
మంచిసంగతులు తెలుసుకోని నేనువస్తాను
నిమిషమైనా నాడేరావద్ద మీరేయుండండి
యీరీతిగా చెప్పెను యప్పుడు ధర్మారాయునికీ
తనడేరావద్దకు పంపినాడయ్యా ధర్మారాయున్ని
రాజువద్దకు పంపినాడయ్యా దుబాసిలక్షుమయ్యా
వందనమయ్యావందనమయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి దివాణమంటా ధర్మారాయుండు

రాయబారమువచ్చినాడయ్యా పాలించివద్దకు
రాయబారమువాళ్ళపంపితే పాలించిదొరగారు
ప్రాంచిదొరని [illegible] కోటకుపోతాడు
సంతకేళ్ళలో [illegible] చెప్పెను ధర్మారాయుండు
సంతలోజొచ్చిన ధర్మారాయుడు కొలువుబోతేను
పన్నెండుయేండ్లు పోసపెసిన కోటలుతియ్యాలేము
ఈరీతిగ చెప్పినాడయ్యా మహాసిలుకుమయ్యా
ఈమాటలు విన్నాడయ్యా విజయరామరాజు
కన్నెర్రజ్యావగా కళ్ళగుండెలు తాయన పగిలేను
పరువు విడిచి లేచినాడయ్యా విజయరామరాజు
పాలించివారి దేవావద్దకు పస్తువున్నాడు
రెండులక్షల వరహాలప్పుడు నజరుపెట్టుకోని
పాలించివారి చేటికివచ్చి వందనమొసగేను
వందనమయ్యా వందనమయ్యా పాలించిదొరగారు
యీరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
రెండులక్షల వరహాలప్పుడు నజరుబోసినాడు
అప్పుడేమని చెప్పినాడయ్యా పాలించిదొరగారు
కంబైటో కంబైటో విజయరామరాజు
బైటోజీయని చెప్పినంతలో విజయరామరాజు
అట్టివేళలో చెప్పినాడయ్యా విజయరామరాజు
నాదుమనవిని చిత్తగింపుము పాలించిదొరగారు
అట్టిమాటలకు రోసిన్నాడు పాలించిదొరగారు
బొబ్బిలివారి దివాణమంటూ ధర్మారాయుండు
రాయబారమే వచ్చినాడయ్యా ధర్మారాయుండు

రాయబారమే వొప్పకబోతివి విజయరామరాజు
లేనిమాటలు యెత్తిబల్కి కోటకుబోతాడు
కోటకుబోతే యేమిచేయునో ధర్మారాయూడు
పేరుచెందిన సరదారిబిడ్డ ధర్మారాయూడు
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
దండుకొచ్చిన ధర్మారాయుడు కోటకబోతేను
వన్నెండు ఏండ్లు పోరుచేసిన కోటలుతియ్యము
బొబ్బిలికోటకు పోరుసింహము ధర్మారాయుండు
మాటలవల్ల చంపుతున్నాను ధర్మారాయున్ని
శెలవివ్వండి శెలవివ్వండి ప్రాంచిదొరగారు
ఈరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
అట్టివేళలో ప్రాంచివారు మాబాగన్నారు
అక్కడనుంచి వచ్చినాడయ్యా విజయరామరాజు
డేరావిడిచివచ్చినాడయ్యా విజయరామరాజు
రుమాలుగుడ్డ తలలోగట్టి విజయరామరాజు
దండుకు మన సుబేదారుని యప్పుడు బిలచెను
నన్నుబిలిచిన కారణమేమి విజయరామరాజు
వరాకులేక వినుమూ యిపుడు హైదరుజంగోజీ
పోతున్నాడు పోతున్నాడు ధర్మారాయుండు
ప్రాంచివారిడేరావద్దరు సంధికొచ్చినాడు
రాయబారము వొప్పకపోయె ప్రాంచిదొరగారు
బూచిగారిని దూరనాడి పోతువున్నాడూ
దండుకులోగ పోతున్నాడు ధర్మారాయుండు
మళ్ళించండి మళ్ళించండి ధర్మారాయున్ని

మాటలచేత పట్టిపెట్టుము ధర్మారాయున్ని
పట్టి కట్టి బంధించి నా చేటికి తెన్నండి
నిమిషములోపల చంపవలెను యిక ధర్మారాయున్ని
మాటలవలన చిక్కకపోతె ధర్మారాయున్ని
పారాలమీదనే చంపవలెను ధర్మారాయున్ని
ఈరీతిగా చెప్పినాడయ్యా విజయరామరాజు
ఈమాటలు విన్నాడయ్యా హైదరుజంగోజీ
ధర్మారాయునికడ్డమైనారు పారాచౌకీలు
కన్నుసైగలు చేసినారయ్యా పారాచౌకీలు
గుంపుగవచ్చికమ్మిందయ్యా పారాయవ్వుడు
మూండువేల ముకుందబలము పారాకమ్మినారు
రెండువేల సోల్జరును పారాకమ్మినారు
పోనియమయ్యా పోనియమయ్యా ధర్మారాయుడా
రాజుగారి పుత్రరువులేక బాటలు విడువము
పాగించివారితో వాదులుజేసి కోటకుపోతాను
పారామధ్య చిక్కినావురా ధర్మారాయుడా
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుడు
అన్నలార తమ్ములార పారాచౌకీలు
రాయబారముకు వచ్చినాను ప్రాంచిపేటికి
రాయబారము కుదరలేదు యిక పోతూవున్నాను
యుద్ధమునకు రాలేదయ్యా పారాచౌకీలు
వారివారి బలమంతయు కోటలోచూతాము
యింతేగాక యికయేమలేదు పారాచౌకీలు
యీగీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు

అట్టిమాటలకు యేమంటారు పారాచౌకీలు
నిన్నుబట్టి గట్టి తెమ్మన్నారు బేటికిపుఁడుదా
ఈరీతిగా చెప్పినాడయ్యా హైదరుజంగోజి
యట్టి మాటలు విన్నాడయ్యా ధర్మారాయుండు
నన్నుబట్టి బంధించిరాజు బేటికి తెమ్మనెనా
నన్నుబట్టెడి మొగధీరులు దండులోయున్నారా
నన్నుబట్టెడి సుబేదారులు దండులోయున్నారా
దండులోక్కడేయున్నాడయ్యా హైదరుజంగోజి
కన్నుసైగ చూపించిర యప్పుడుజూ చెదను
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
మాటలవల్ల చిక్కలేదు ధర్మారాయుండు
కన్నుసైగ చేసినాడయ్యా హైదరుజంగోజ
కన్నుసైగ జూచినారు పారాచౌకీలు
యాబై రెండు తుపాకులాట పెలితాలుంచిరి
తుపాకియొక్క శబ్దమువిన్నాడు ధర్మారాయుండు
వాసివెంటనే వస్తున్నాది బారాతేజిదా
ఉడాను వేసి యెగిరినాడు తేజీమీదను
పళపళమని రాల్చినారయ్యా టుపాకులంతాను
గొబ్బున తాను తిప్పినాడయ్యా తేజిని యప్పుడుదా
నాలుగుపక్కల త్రిప్పినాడయ్యా బారాతేజిని
యెగిరినాది యోజ పొడుగు తేజియప్పుడుదా
భూమిమీదనే బారినాదిర బారాగుఁడ్లుదా
తొలిదెబ్బ తప్పించుకొన్నాడు ధర్మారాయుండు
రెండవతూరి వచ్చినారయ్యా పారాచౌకీలు

పళపళమని కాల్చినారయ్యా తుపాకులంతాను
అప్పుడెట్లావున్నాడయ్యా ధర్మారాయుండు
నాలుగుపక్కల త్రిప్పుతున్నాడు బారాతేజిని
కాలుసైగ చేసినాడయ్యా బారా తేజీకి
కాలుసైగ చేసినాదీర బారా తేజీదా
కదలక మెదలక భూమిపైగాను తానుడగ్గేను
డిగ్గించిదాని సిలిపినాడు ధర్మారాయుండు
శిరస్సుమీద వెళ్ళిపోయెను బారాగుండ్లుదా
మరుదెబ్బను తప్పించుకొన్నాడు ధర్మారాయుడుదా
యింకనుమనము జయించజాలము ధర్మారాయునితో
ఈరీతిగా చెప్పినారయ్యా వారా చొకీలు
అప్పుడేమని చెప్పినాడయ్యా హైదరుజంగోజి
యలమబిడ్డల శిరస్సుజూచి టుపాకిలంతాను
వంచివంచి నిలువుమయ్యా టుపాకిలంతాను
యీరీతిగా చెప్పినాడయ్యా హైదరుజంగోజి
యలమబిడ్డల శిరస్సుజూచినది టుపాకిలంతాను
పళపళమని కాల్చినారయ్యా టుపాకులంతాను
ముగ్గురైన యల్మాదొరలు భూమిలోపడ్డారు
యల్మలచావు కన్నులజూచెను ధర్మారాయుండు
యెన్నడులేనికోపముగలిగె ధర్మారాయుడికి
అన్నలార తమ్ములార యల్మాదొరలూదా
మీదుబలములు యక్కడపోయె యల్మాదొరలుదా
యీరీతిగ వ్యసనముతోడను ధర్మారాయుండు
చిక్కిన తక్కిన రాణువలతోను యప్పుడువలికెను

అన్నలారా తమ్ములారా యల్మా దొరలుదా
ముందువెనుక జూడవద్దు దండుకులోగాను
రాజువారి చెయ్యియిప్పుడు మొండునచూపిరి
మీాదుబలములు చూపండయ్యా దండుకులోగాకూ
పట్టాకత్తులు రెండుచేతుల ఖగ్గునపట్టెను
రామరామ అనంతకాలము రాజ్యమేలలేము
యెన్నిదినములు బ్రతికినగాని చావేయున్నది
యిచ్చటచచ్చినవారికిచాల వీరస్వర్గము
ధైర్యపుమాటలు చెప్పినాడయ్యా ధర్మారాయుండు
దండులోగ దూకినారయ్యా యుద్ధముచేయను
ఈబొబ్బిలయ్యలు యెత్తినారయ్యా యల్మాబిడ్డలు
వేటువేటుకు నరికినారయ్యా ఏనుగులబారు
ఏనుగులతొండము బట్టిముప్పును ధర్మారాయుండు
పట్టినిచింపి భూమిమీాదనే ఖగ్గునవేసెను
పట్టాకత్తులతో పదిమందైనా తాయిగపడలేరు
అప్పుడుతిన్న పప్పుకూడన్నము కుప్పగ పడినాది
హరి రామరామ శ్రీరామయటు వస్తువున్నారు
వారివెంబడి వస్తున్నారు యల్మాదొరలుదా
చేతులుచేతులు పెనవేసి చేతులచ పీని
కాళ్లుకాళ్ళు పెనవేసి కాళ్ళతో జంపిరి
ఈరీతిగా వస్తున్నారు యల్మాదొరలుదా
అప్పుడెళ్లావున్నాడయ్యా ధర్మారాయుండు
ముందుగాను నరికినాడు మున్నూటికైన
వెనుకతూరి నరికినాడయ్యా యేనూటికైన

చలోచలో యంటుయప్పుడు వస్తువున్నాడు
బొబ్బిలివారి దేవిడివద్ద బాటలుకొట్టేను
అక్కడక్కడపారాలన్ని వెనుకకుపోయింది
పారాలన్ని హతముచేసెను ధర్మారాయుండు
కొండలడవుల పాలాయెను పారించిదండుదా
చిల్లివంటి రక్తమూడ చిమ్మిపారింది
రాళ్ళరప్పల పాలాయెను రాజులదండుదా
రక్తములోన తుండెమొండెములు పైకితేలింది
గోడుగోడు చేసెనయ్యా దండుకులోగాను
ముగ్గురైన యల్మాదొరలు చచ్చినచోటున
అయిదువేల యేనూటీదండు హతముచేసెను
కోటగవినికి వస్తావున్నాడు ధర్మారాయుండు
కోటగవినికి వచ్చినయపుడు గోవిందంబెట్టెను
యాబై ముప్వురుయల్మాదొరలను యెంచుకొన్నాడు
ముప్వురైన యల్మాదొరలు తగ్గబడినారు
తనలోను చింతించేను ధర్మారాయుండు
పోరుపెట్టుకొని కోటకుమనము యెట్లుపొయ్యేది
బావగారు రంగయ్యతోను యేమనిచెప్పేది
వారియొక్క తల్లిదండ్రులకు యేమనిచెప్పేది
యీరీతిగా యోచించెను ధర్మారాయుండు
హజారమునకు వస్తువున్నాడు ధర్మారాయుండు
వెనుకచిక్కి వస్తున్నాడు రంగయ్యదొరగారు
వరాహంచక వినుముయిప్పుడు ధర్మారాయుండా
పోయినకార్యమేమాయెను ధర్మారాయుండా

కాయాయన వండాయన ధర్మారాయుడా
కాయగనిలచి యప్పుడెమనకు కలహము వచ్చెను
రాజమాటలు పాలించీమాటలు యొకటైయున్నాది
రాయబారముకుజరకపోతే వస్తువుంటెని
పారామీద పోరుయాటలు గట్టిగజరిగెను
ముగ్గురైన యల్లమ్మబిడ్డలు పోరుబెట్టినారు
యల్లమ్మబిడ్డలు పోరుబెట్టిన చోటును యప్పుడుదా
అయిదువేల యేనూటిడండు తాయిగ చంపితిని
కోటలో యుండె పోలేరమ్మకు జాతరజేయిస్తి
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
పాపారాయుడు సంధికీపోతే అక్కడనైతేను
కానికాని మాటలవలన కలహంవస్తేను
పాలించివారి శిరస్సుకోసి కోటకుగట్టును
రాజుగారి శిరస్సుకోసి కోటకుగట్టును
కొలువునయుండ తగదుయిప్పుడు ధర్మారాయుడ
వారకాంతల మేడలకైన బొమ్మనిచెప్పెను
పదిమందిలో చిన్నబుచ్చెను వెంగళరాయుండు
అంతలోపలయేమన్నాడు ధర్మారాయుండు
బావగారి వుత్తరువులేదు బావగారు దొరలు
బావగారి వుత్తరువునాకు కొంచముంటేను
డేరాలోగా చంపివాని కొలువుకు వస్తును
శెలవులులేక భేటికివస్తిని వెంగళరాయుడా
మంచిదన్నాడు బాగన్నాడు ధర్మారాయుండు

అప్పుడైన మల్లమ్మదేవి యెడమవచ్చేను
అప్పు డేలాగన్నాడయ్యా మల్లమ్మదేవిదా
భారాశం బేము పెట్టియున్నాము వగలాడుతున్నది
తనతమ్ముణ్ణి కన్నులచూచెను మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పినాదిర మల్లమ్మదేవిదా
పరాకులేక వినుము యిప్పుడు ధర్మారాయుడ
యెప్పుడురాని అన్నగారు యెందుకువస్తిరి
మీరుజెప్పిన కార్యమేమి తెలియజెప్పండి
యేమి అపాయం జెందెనయ్యా బొబ్బిలికోటలో
అంగీకంతా రక్తమేమి ధర్మారాయుడా
ఈరీతిగా యడిగినాది మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పినాడయ్యా ధర్మారాయుండు
పరాకుంచక వినవేతల్లి మల్లమ్మదేవిదా
కర్మచండాలుడు కులద్రోహి విజయరామరాజు
కోటకివ్వాడు దండుతెచ్చెను విజయరామరాజు
భూము తెరుగని ప్రాంచివారి భూములకొచ్చిరి
యధికదళముతో వచ్చియున్నారు కోటకమ్మినారె
యెటు పక్కలను చూచినగాని ఏడ సందులేదు
రాయబారమునకై పంపినారుగ రంగయ్యదొరగారు
రాయబారముకు పోతినమ్మా దండులోగాను
ప్రాంచివారి డేరావద్ద సంధికిపోతిని
రాయబారము కుదరకపోయె వస్తుపుటేని
పారావీడ గట్టిమాటలు గట్టిగ జరిగేను
ముగ్గురైన యల్లమ్మదొరల పోరుపెట్టినారు

ముగ్గురైన యల్మాదొరలు చచ్చినచోటులో
అయిదువేల మేనూటిదండు సాపుగ జంపితినీ
బావగారి సమస్థానమునకు తాయిగవస్తిని
సంగతులన్నియు చెప్పితినమ్మా బావగారితోను
నిండుకొలువున చిన్నబుచ్చును రంగయ్యదొరగారు
వారకాంతల మేడకిప్పుడు పొమ్మనిచెప్పెను
ఈరీతిగా చెప్పినాడయ్యా ధర్మారాయుండు
ఇన్నిమాటలు విన్నాదమ్మ మల్లమ్మదేవిదా
తమ్ముడికన్ని ధైర్యప్రమాటలు తానుచెప్పినాది
రక్తమైన అంగీలంతా తీసివేసినాది
స్నానమపుడు చేయించినాది మల్లమ్మదేవిదా
చలవవస్త్రము గట్టించెను ధర్మారాయుడికి
పెనిమిటిసభకు పంపెనుమరల మల్లమ్మదేవిదా
అప్పుడెట్లావున్నాడయ్యా రంగయ్యదొరగారు
నిండుకొలువులో వున్నాడయ్యా రంగయ్యదొరగారు
అన్నతమ్ములు భావమరుదులు కొలువుతీరినారు
ముందు జరిగే కార్యమునకు యోచిస్తున్నాడు
యిక్కడియొక్క సంగతులన్ని యిట్లువున్నాది
అప్పుడెట్లా యున్నాదయ్యా మల్లమ్మదేవిదా
విజయ రామ రాజుగారికి వ్రాసెను జాబుదా
వందనమయ్యా వందనమయ్యా విజయరామరాజా
పూసలపాటి వారియిల్లు పుట్టేల్లమకొంటె
దామర్ల వారి సమస్థానమును మరచపోయినాను
అన్న యనిదా నమ్మినాను విజయరామరాజు

విజయనగరము బొబ్బిలికోట వడికుండలు
కావడికుండలు తప్పించవద్దు కన్నతండ్రినీవు
నల్లగాజులు నల్లపూస నాకు నిల్పండి
బొమ్మకాటుక నిల్పుమయ్యా విజయరామరాజు
పసుపుకుంకుమ నిల్పుమయ్యా విజయరామరాజూ
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటాను
ఈవిధారం జాబువ్రాసి మల్లమ్మ దేవియు
మున్నాటిలో పెద్దదాసి వెంకటలక్షుమమ్మ
వెంకటలక్ష్మిని యప్పుడు పిలిచెను మల్లమ్మదేవియు
పరుగెత్తిరదా వచ్చెనమ్మ వెంకటలక్ష్మియు
వందనమమ్మ వందనమమ్మ మల్లమ్మదేవిదా
నన్ను పిలచిన కార్యమేమి మల్లమ్మదేవిదా
అప్పుడేమని చెప్పినాది మల్లమ్మదేవిదా
పరాకుంచక వినవెతల్లి వెంకటలక్ష్మమ్మ
తొల్లి పగలు మనపై యుండెను విజయరామరాజు
దేశమెరుగని ప్రాంచివారిని తెచ్చియిచ్చుటను
యిరువై నాలుగు వేలదళముతో పాంచివచ్చినాడు
యధికదళములు వచ్చి యిప్పుడు కోటకమ్మినారు
గొల్లపల్లె కోనేటిలో రాజుడేరాదా
జాబుబెత్తుకొని రాజుముందుకు తాయిగ పొమ్మండి
రాటకొలువున జాబునుబెట్టి వందనమొనరించు
యీరీతిగా చెప్పినాది మల్లమ్మదేవియు
జాబుకమ్మను యెత్తియిచ్చె మల్లమ్మదేవియు
చాపకన్ను దరవాజాగుండ నడవసాగిరి

రాజుగారి దండులోపల వస్తువున్నాది
రాజుగారి కొలువున వుంచి వందనమొసగెను
యెవ్వరితాలూకా యన్నాడయ్యా విజయరామరాజు
మల్లమ్మదేవి తాలూకాయని దాదులు చెప్పిరి
మల్లమ్మదేవి జాబునేను తెచ్చినానయ్యా
తెచ్చినజాబు కొల్వునబెట్టెను వెంకటలక్ష్మమ్మ
జాబునుయపుడె చేతనెత్తెను విజయరామరాజు
జాబులోని సంగతులన్నియు కన్నులజూచెను
పరాకుంచక వినుము యివ్వాడు విజయరామరాజా
అన్నయనిదా నమ్మినాను విజయరామరాజా
పూసలపాటివారియిల్లు పుట్టిల్లనుకొంటి
దామర్లవారి సంస్థానమే మరచిపోయినాను
విజయనగరము కావడికుండలు మరచిపోయినాను
కావడికుండలు తప్పించవద్దు కన్నతండ్రినీవె
ఈతూరి మన్నించుమయ్యా బొబ్బిలికోటాను
మంచిమంచిచీరెలునేను మావదినెకంపుతాను
నల్లపూస నల్లగాజు నాకునిల్పండి
బొట్టుకాటుక నిల్పుమయ్యా విజయరామరాజా
పసుపుకుంకుమ నిలుపుమయ్యా బొబ్బిలికోటాను
ఈరీతిగ వ్రాసియున్నది జాబులోగాను
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
పరాకుంచక వినవేతల్లి మల్లమ్మదేవిదా
నల్లపూసలు నల్లగాజులు నిల్పనుతరమాన
బొట్టుకాటుకనునిల్పనునాకు తరముగాదుతల్లి

మాండబోసితే మూడుపల్లెలే యినాములిస్తానా
ముండకోక ముందుగ వేతు మల్లమ్మ దేవిడా
ముందుకూర ముందుయున్నము నీదేమన్నాడు
విజయనగరమునుండినేను జాబువ్రాస్తిని
జాబు తెచ్చిన హర్కారీలను చంపలుకొట్టించి
మెడనుబట్టి త్రోయించెను వెంగళరాయుండు
అడవారిజాబులు యప్రుడు కొలువున రాజాడు
చదివినట్టి జాబులక్కడ చింపివేసినాడు
జాబు తెచ్చిన వెంకటలక్ష్మిని చెంపలుగొట్టెను
మెడబట్టి త్రోచెనయ్యా విజయరామరాజు
ఘోరుఘోరమున దుఃఖించినాది వెంకటలక్ష్మమ్మ
మల్లమ్మ దేవి కొలువునవచ్చెను వెంకటలక్ష్మమ్మ
ఘోరుఘోరమున దుఃఖించెను వెంకటలక్ష్మమ్మ
యింతలోపల యేమన్నాది మల్లమ్మ దేవియు
పోయినట్టి పని యేమాయెను వెంకటలక్ష్మమ్మ
మీరు యిచ్చినజాబులక్కడ కొలువున బెట్టితిని
జాబును యప్పుడె చదువుకొన్నాడు విజయరామరాజు
ముండమోసితే మూడుపల్లెలు యినాములిస్తాడు
నిన్ను అధిక మాటలవల్ల తిట్టినాడుతల్లి
చదివినట్టి జాబులక్కడ చింపివేసినాడు
చింపినట్టి జాబులును నిప్పుపెట్టెను
చంపల్లైన కొట్టినాడు మల్లమ్మ దేవిడా
మెడనుబట్టి దోచెనమ్మ మల్లమ్మ దేవిడా
యీరీతిగా చెప్పినాది వెంకటలక్ష్మమ్మ

యిక్కడికథలు యీలాగువున్నది కోటపలోగాను
అప్పుడెట్లా వున్నాడయ్యా వెంగళరాయుండు
అన్నగారు రంగయ్యదొరకు యెరుక లేకుండాను
వదినెగారు మల్లమ్మదేవి యెరుకలేకుండాను
బావమరిది యప్పుడెతాను జాబులువ్రాస్తాడు
కాగితంబును తానేయప్పుడు చేతనెత్తేను
రాజాధిరాజ రాజపూజిత పాపారాయుడ
నీకటాక్షము చాలాయుంచుము పాపారాయుడా
కోటమీదనే దండు తెచ్చెను విజయరామరాజు
యధికదళంబులు వచ్చియిప్పుడు కోటకమ్మినారు
మంచినీళ్ళభావివద్ద లశుమయ్యడేరాదా
పాతబొబ్బిలి పాటిమీదనే ప్రాంచిడేరాదా
గొల్లపల్లి కోనేటిలో రాజుడేరాలూ
యీరీతిగా యున్నారయ్యా కోటలచుట్టను
రాజునుగొట్టి రేవులవద్ద మీరేరన్నండి
ప్రాంచినిగొట్టి రేవులవద్ద మీరేరన్నండి
యీరీతిగావ్రాసెనుజాబులు తానేయప్పుడు
లకోటనై తేచేసినాడు జాబుకులోగాను
యిద్దరైన బేగిరావుల తానుబిలిచినాడు
స్త్రీలవేషము వేసినాడయ్యా బేగిరావులకునూ
కురులునున్నగ దువ్వించెను కొప్పుబెట్టినాడు
చీరెలు రవికెలు గట్టించెను బేగిరావులకును
గాజులప్పుడు తొడగినాడు బేగిరావులకును
గంపనిండ తోటకూరకోసి వేసినాడు

గోధుమపిండి వరిపిండిని పాకముచేయించి
రొట్టెలప్పుడు కాల్చినాడు వెంగళరాయుండు
రొట్టెలోనేపెట్టినాడు జాబును యప్పుడుదా
తోటకూర నడుమ నప్పుడు రొట్టెలుబెట్టిరి
అప్పుడేమని చెప్పినాడు వెంగళరాయుండు
డేరాడేరాడేరావద్ద కూరలుఅమ్మండి
వెలలు అధికం చెప్పిమీరు కూరలు అమ్మండి
పారాలోపల బడిపోన్నండి బేగిరావులు
రాజారములో వున్నాడయ్యా పాపారాయుండు
రాజువారువస్తారని బాట కాచివున్నాడు
రాజారములో తాణావున్నాడు పాపారాయుడు
పాపారాయుని వద్దకుయిప్పుడు మీరేపోన్నండి
రొట్టెయందు జాబుకమ్మను కొలువునవుంచండి
యిచ్చట నడిచిన సంగతులన్ని తాయిగ చెప్పండి
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుడు
చావకన్ను దరవాజాగుండా యప్పుడెపోయిరి
యచ్చటినుండి వస్తున్నారు బేగిరావులు
డేరాడేరాడేరావద్దను కూరలుయమ్మకొని
కూరకూరకూరయంటు కూతలుబెట్టిరి
వెలపాడుగు ధరలుజెప్పుతూ కూరలమ్మినారు
పాళించివారి దండులోగా కూరలమ్మినారు
కొండప్రక్క వచ్చినారు బేగిరావులు
కొండప్రక్క రాజుగస్తి తిరుగుతుయున్నాది
కత్తులపారా కలాసుపారా తిరుగుతుయున్నారు

దొంగజేరు పారాలన్ని తిరుగుతుయున్నారు
పారావద్ద డాకలైరి బేగిరావులు
యప్పుడేమన్నారయ్యా పారాచౌకీలు
యేవూరు యేపల్లెవారు తెలియచెప్పండి
కొండప్రక్క గొల్లపల్లెలో మేముయుండేది
గంపలో యేమే గంపలో యేమే మమ్ముగన్నతల్లి
పరాకుంచక వినుమియిపుడు పారాచౌకీలు
తోటకూర యమ్ముతుమేము వస్తుయున్నాము
కొంతకూర మాకుపెట్టుము మముగన్నతల్లి
యిట్లు చెప్పుతు గంపలు యపుడు దిగువదించినారు
కిందుమీదుగ చూపినారయ్యా తోటకూరను
అప్పుడేమన చెప్పినారయ్యా పారాచౌకీలు
రొట్టెలెందుకే రొట్టెలెందుకే మమ్ముగన్నతల్లి
ఆకలికొంటె రొట్టెలనుతిని దాహము చేతుము
యీరీతిగా చెప్పినారయ్యా బేగిరావులు
అట్టిమాటలకు యేమన్నారు పారాచౌకీలు
మాయింటియొక్క ఆడవారు రొట్టెలు కాలిస్తె
యెంతదా సుఖముగయున్నదె మముగన్నతల్లి
యిట్లుచెప్పుతు రొట్టెలువారు నడుమునతుంచిరి
రొట్టెలోయుండు మర్మపుజాబు బయటపడినాది
రొమ్మురొమ్ము గుద్దుకున్నారు పారాచౌకీలు
యిద్దరి నప్పుడు బట్టుకోని కైదులో వుంచిరి
రాజుగారి డేరావద్దకు తీసుకవచ్చిరి
ఖైదులోను తీసుకవచ్చిరి బేగిరావుల

రాజుగారి కొలువునవచ్చి వందనమొసగిరి
పరాకుంచరా వినుము యిప్పుడు విజయరామరాజు
బొబ్బిలివారి ముచ్చిలిజాబు మేము తెచ్చినాము
జాబులు యపుడు చేతికిచ్చెను పారాచౌకీలు
కోటకెల్ల కొరసింహము కోటలోలేదండి
రెండులక్షల వరహాలపుడు నజరుయెత్తుకొని
ప్రాంచివారి డేరావద్దకు పారివచ్చెను
సలామయ్యా సలామయ్యా ప్రాంచీదొరగారు
యీలాగున జెప్పినాడయ్యా విజయరామరాజు
యిద్దరుయొక్క కుర్చీమీద కొలువుతీరినారు
అప్పుడేమని చెప్పినాడయ్యా విజయరామరాజు
బొబ్బిలివారి దొంగజాబులె బైటపడినాది
తెచ్చిపట్టి దొంగజాబులె చేతికిచ్చెను
జాబును చేత దీసుకొన్నాడు ప్రాంచిదొరగారు
జాబులోయుండు సంగతులన్ని కన్నులజూచెను
అప్పుడేమని చెప్పినారయ్యా ప్రాంచిదొరగారు
పాపారాయుడు యెవరన్నాడు ప్రాంచిదొరగారు
చిన్నమనవి చిత్తగించుమి ప్రాంచిదొరగారు
బొబ్బిలియందుండువారికి పేరుజెప్పుతాను
రంగరాయుని తమ్ముడుగారు వెంగళరాయుండు
రంగారాయుని బావమరిది ధర్మారాయుండు
వెంగళరాయుని బావమరిది పాపారాయుండు
పేరుయెత్తిన సరదారిబిడ్డ పాపారాయుండు
పులిలేదయ్యా పులిలేదయ్యా బొబ్బిలికోటలో

పాపారాయుడు యుద్ధరంగుకు పటాలరాముడు
పటాలరాముడు మొనగాడండీ ముత్యాలపాపయ్యా
నూటికియొకడె సరదారియున్నాడు కోటకులోగాను
కోటలకంతయు కోరసింహము పాపారాయుండు
ఇదిసమయంబు యిదే వేళర బొబ్బిలిమీదికి
ఈరీతిగ చెప్పినాడయ్యా విజయరామరాజు
అట్టిమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
యెవ్వరికి మొనగాడండీ పాపారాయుండు
పాపారాయుండనినీవుబహు ప్రసిద్ధిజెప్పేవు
ఈరీతిగా జెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
అట్టిమాటలకు యేమన్నాడు విజయరామరాజు
అట్లుచెప్పవద్దు అట్లుచెప్పవద్దు ప్రాంచిదొరగారు
పాపారాయుడని వానిపేరుయిక మీరుచెప్పితేను
పసిబిడ్డ బాలాదులైన పాలుతాగలేరు
బొబ్బికోటకువస్తాడయ్యా పాపారాయుండు
తాండ్రవారి పాపారాయుడు కోటలోయుంటేను
యింతసేపు నిల్వనిచ్చునా కోటలక్రిందాను
నల్లయేరు దాటనివ్వడు పాపారాయుండు
యికయేమి చెప్పుదునయ్యా ప్రాంచిదొరగారు
అటువంటి దొంగజాబులు యెన్నిపోయినవో
యిక్కడియొక్క సంగతులును తెలిసియుంటేను
రాత్రిరాత్రి వచ్చునయ్యా పాపారాయుండు
పడకలోను గుమ్మినవాడు కోటకుపోతాడు
నమ్మరాదు నమ్మరాదుబొబ్బిలిదొరలాను

కాలహరణము చేయరాదు ప్రాంచిదొరగారు
మూడవజామున తియ్యవలెను బొబ్బిలికోటాను
రాత్రిపూటనే బొబ్బిలికోటను పట్టండిమీరు
తెల్లవారగా దేవిడికిముందుపాంచిదొరగారు
పన్నెండులక్షుల పైకమైతే గొబ్బునయిస్తాను
యెదురుగాను నిల్వబెట్టెను విజయరామరాజు
ఫిరంగిగుండుతో కాల్పించెను విజయరామరాజు
తలుపుతెరచిన చందమామను బొబ్బిలికోటాదా
యీరీతిగ చెప్పినాడయ్యా విజయరామరాజు
దొంగజాబు తెచ్చినట్టి బేగిరావులకును
దొంగజాబులను తెచ్చినవారిని యేమిచేసినారూ
తొలిదెబ్బకు తూలిబడ్డారు బేగిరావులును
రాజుమాటలేవిన్నాడయ్యా ప్రాంచిదొరగారు
యీసంగతులే తెలియకపోయె వెంగళరాయుడికి
బొబ్బిలివారి బలములంతా తెలియకయున్నారు
కానకవక్క ఫరమానైతే రాజుకయిచ్చేను
అప్పుడెట్లావున్నాడయ్యా పాంచిదొరగారు
బొబ్బిలివారి మన్నెంమీదికి కదలివచ్చినారు
ఇన్నాట ఆవుతరువులే కొల్లబెట్టినారు
మున్నాటికి పందిపిల్లల కొల్లబెట్టినారు
ఆవులగొంతులు గోసినాడు పాంచిదొరగారు
పందులగొంతులు గోసినాడుదా పాంచిదొరగారు
పచ్చిరక్తం బరంజీసారాయి పాకంచేయించి
దండుకు మొనసుబేదారుని సిలిపించినాడు

దండుకు మొన సుబేదారుడు హైదరుజంగోజి
హైదరుజ గోజి కొలువుకువచ్చి సలాముచేసేను
మనిషికియొక్క మూడుగిన్నెలు లాహిరిత్రాగించె
లాహిరి త్రాగిన మూడునిమిషములకు కైపుయెక్కెను
కోటమీదుగా నడచినారయ్యా జాతులవారుదా
మందుపెట్టెను పగలగొట్టి మందులు వరచిరి
మందుబెట్టిన తిత్తికుండలు బండ్లవేసిరి
పెద్దఫిరంగి గుండ్లంతయు బండ్లవేసిరి
యీరీతిగా ప్రయాణమైనావి ఈనిమిషంబులోన
యచటనుండి వస్తున్నారు జాతులవారుదా
కోటదిగువకువచ్చినారు జాతులవారుదా
మద్దిమానులు కొట్టించినారు జాతులవారుదా
అడ్డత్రోవదా నడచినారు ఫిరంగిగుండ్లుదా
తట్టుకోట క్రిందికివచ్చి మకాము చేసిరి
పెద్దఫిరంగి బండ్లంతయు మోహర్జాలెత్తిరి
రామలక్ష్మణ ఫిరంగికి మోహర్జాలెత్తిరి
పదికత్తులకె శెలవిచ్చినారు జల్లకొట్టినారు
పళపళయని కాల్చినారు ఫిరంగీలతలము
తొలిదెబ్బకు బొబ్బిలికోట బద్దలాయెను
గడ్డకుగడ్డ పడిందయ్యా భూమికిపైగాను
తట్టుకోటలోయున్నాడయ్యా పటాలరాముడు
యెక్కివచ్చి ప్రాంచివారిని కన్నులజూచెను
యీపైముగ్గురు యల్మాదొరలు వెంటనేయున్నారు
అన్నలార తమ్ములార మాయన్నలార రండు

రంగయ్యాలో చెప్పబోతె ఆలస్యమవుతుంది
చచ్చినాను బ్రతికినాను పేరేయుంటుంది
ముందువెనుక చూడవద్దు దండుకులోగాను
బారాతేజి యెక్కియప్పుడు పటాలరాముండు
కన్నుసైగ చేసినాడయ్యా పటాలరాముండు
యీటెమీద సాముచేసిరి యల్మాదొరలుబా
యెక్కివచ్చి పాలించివారిని సాపుగ చంపిరి
కోటవెలుపల దూకినాడు పటాలరాముడు
డేగలాగున దూరినాడు పటాలరాముడు
పంచిపంచి యీటెలతోను వాదులుయాడిరి
చేతులతోను బట్టియప్పుడు బాకునగుమ్మిరి
మెడనుంచి వీపుమీద బాకునగుమ్మిరి
మట్టుబెట్టిరి జాతులవారిని గొంతులుగోసిరి
కాళ్ళతో త్రొక్కి గొంతులుగోసిరి పాలించివారిని
గురిమచుట్టు గుంపులుగానే పోరుచేసినారు
అక్కడక్కడ పారాలన్ని వెనుకను బోయినారు
దండుకు మొన సుబేదారుగ హైదరుజంగోజి
జయించజాలగ ప్రాంచివారి ముందుకువచ్చెను
సలామయ్యా సలామయ్యా ప్రాంచిదొరగారు
అప్పుడేమని చెప్పినాడయ్యా పాలించిదొరగారు
యిప్పుడుజరిగే యుద్ధరంగము యెవ్వరిదన్నాడు
పటాలరాముని యుద్ధమిపుడు జరుగుతుయున్నాది
పటాలరాముని మనమే యిప్పుడు జయించలేమండి
మూడుపుట్ల నల్లమందుకే శెలవులుయివ్వండి

భూమిమీద పరచినాడు జాతులవారుదా
రవ్వగుండ్లు పరచినాడు మందుకులోగాను
నాలుగువక్కల మందుతాళ్ళు తగిలించినారు
నిప్పులబెట్టెజాతులవారు వెంటనేయున్నారు
మున్నాటికి కవాతుగుఱ్ఱము ముందుగయున్నాది
రామ రామ రామ యంటు వస్తువున్నారు
గుఱ్ఱమునుచుదూకినారయ్యా యల్మాదొరలూదా
నాలుగువక్కల త్రిప్పినాడు కవాతుగుఱ్ఱమును
తెలియకవచ్చి నల్లమందులో పడికూలిరి
నాలుగువక్కల నిప్పుతాళ్ళు తగిలించినారు
ముందువెలుపట దూకినాడు పటాలరాముండు
మలమల మనుచు మాడినారు యల్మాబిడ్డాలు
పటాలరాముని బారాతేజి మందునకూలినది
యొక్కడైనిలిచినాడు పటాలరాముండు
నిప్పులుబెట్టు జాతులవారి గొంతులుగోసెను
వేటువేటుకు నరికినాడు యేనుగులగుంపును
తరిమితరిమి నరికినాడు దళములంతాను
పక్కబాజిలోయున్నారండి హైదరుజంగోజి
కన్నుసైగచేసినాడు పారావారలకు
యాబై రెండు తుపాకులాడా టప్పునకాల్చిరి
చుక్కలాగున టుపాకిదెబ్బ నొష్టతగిలింది
రొమ్మునతగిలిన గాయాలన్ని యెంచగ తరమౌన
డొక్కలోన తగిలినగుండు వీపునపోయింది
రక్తనెల్లువలు పారుతుంది గాయాలగుండాను

పేగులుకండలు జీరాడేను పటాలరాముడికి
వ్రేలాడు పేగులబట్టి దట్టిలోకట్టేను
మల్లెమొగ్గలవంటిబల్యము తానుతీసుకోని
తరిమితరిమిపొడిచినాడు తొంబయినుందిని
నిలవజాలకపోయెనపుడు పటాలరాముండు
యింతబ్రితుకు బ్రితికినేను వీరిచేతులోన
వీరిచేతిలో చావడానికి జాతకమున్నదా
యీరీతిగా యోచించెను పటాలరాముండు
మంద్యముంచి కొలువుతీరెను పటాలరాముండు
నడుమునయున్న వచ్చలబాకు జుర్రినదూసెను
బాకుతీసి రొమ్మునవేసి భూమినపడినాడు
కుట్టుకుట్టు ప్రాణముతోను వాడెయున్నాడు
పటాలరాముడుచచ్చినాడని ఢంకాకొట్టి
వెనుకబోయిన దండుయపుడు తిరుగావచ్చెను
ప్రాణముతోను పటాలరాముని శిరస్సుగోసినారు
తట్టుకోటలో జండాకొయ్య యెత్తించినా
పుట్టకోటకిగ్రిందవచ్చి మకాముచేసిరి
యాబై రెండు రేఖాలుగా మొహర్జాలెత్తిరి
గుండుమందు వేసియపుడు గెట్టనచేసిరి
పళపళమని కాల్చినారు టుపాకిలంతాను
లక్కతోను గట్టియున్నది పుట్టుకోటయును
ఢాంఢాంమని ఫిరంగులైతే వారేకాల్చిరి
గుండుదెబ్బకు బెత్తెడుకమ్మి సాగుతువున్నాది
సాధ్యానికి రాకయున్నది పుట్టుకోటయూను

శీమవృషములు తెప్పించినారు ప్రాంచివారుదా
కోటలపైగా తగిలించినారు జాతులవారుదా
వృషముతోక పట్టుకోని లగ్గలకెక్కిరి
యెక్కివచ్చిన దండునుయెవృష కన్నులచూచెను
పుట్టకోటలో వున్నాదయ్యా భేరిరామక్క
మున్నారు భేరిస్త్రీలు కోటలో యున్నారు
అందరికన్నా పెద్దదాదీ భేరీ రామక్క
ఆలంగాలకే యెక్కిందీ భేరిరామక్కా
కోటలక్రిందనె జూచినాది భేరి రామక్కా
రాజదివాణం వచ్చినాది భేరిరామక్కా
స్త్రీలనందరిని బిలిచినాది భేరిరామక్కా
యమ్మలారా చెల్లెలార అమ్మలారా రండు
పుట్టకోట కమ్మినాపు పాంచివారగారు
రామరామ యనంతకాలము రాజ్యమేలలేము
జగముయుండువరకు మనము వుండబోతామా
ధైర్యపుమాటలు పలికినాది భేరిరామక్కా
యెన్నాళ్లు బ్రతికినగాని చావేస్థిరమాను
వారివారి దివాణమునకే కదలివచ్చినారు
వారి పురుషులంతా బేరము జేయబోయినారు
వాండ్లవాండ్ల బేరముజేయను వారే బోయిరి
తక్కినవారు పల్లాలుగుండ్లు వీపునగట్టిరి
మనిషిమనిషికి పక్కలాకులు చేతనుబట్టిరి
ముసలివారిని బట్టియప్పుడు గొంతులుగోసిరి
యడాయడా బాలలబట్టి గొంతులుగోసిరి

పాలుత్రాగే బిడ్డలనంతా వీపునగట్టిరి
అలంకారము యెక్కినారు ఘేరీస్త్రీలుదా
యెక్కివచ్చె ప్రాంచిదండును కన్నులచూచిరి
వడిసెలల్లో రాళ్ళుచెక్కిరి ఘేరీస్త్రీలంతా
వడిగాయపుడు రువ్వినారు రాళ్ళు అయితేను
వడిసెలక్రింద మూడువేలుమరణము చెందిరి
రవిడిగుండ్లు దొరలించినారు ఘేరీస్త్రీలుదా
యెద్దులకవ్వడు కాగుతున్నది అంబడిబానాలు
పల్సువేసి బట్టినారు అంబడిబానాలు
బానలంతయు దొర్లించినారు రాణువపైగాను
బానలక్రింద రెండువేలకు మరణముజెందిరి
వాసినమాను తీసినారు ఘేరీస్త్రీలుదా
గిరగిరమని త్రిప్పినారు వాసినమానను
దండుమీదికే వాసినమానులు తాయిగవిడచిరి
మానులక్రింద మూడువేల మరణముజెందిరి
బురుజులక్రింద జేరనివ్వరు ఘేరీస్త్రీలుదా
సింహములాగు విడబడినారు ఘేరీస్త్రీలుదా
అక్కడక్కడ పారాలన్ని వెనుకనెవెళ్ళింది
పటాలమంత పాడుజేసిరి ఘేరీస్త్రీలుదా
చక్రములాగు తిరిగినారయ్యా ఘేరీస్త్రీలుదా
వేటువేటున నరికినారు యేనుగులగుంపునుదా
కోటక్రిందుగ పారాలన్ని సాపుగజంపిరి
అప్పుడెట్లాపున్నాడయ్యా హైదరుజంగోజి
ప్రాంచివారి బేటికివచ్చి సలాముజేసేను

ఇప్పటియుద్ధముఎవ్వరిదన్నాడుప్రాంచిదొరగారు
ఫేరిస్త్రీలయుద్ధమిప్పుడు జరుగుతుయున్నది
బురుజులకిందజేరనివ్వరు ఫేరిస్త్రీలుదా
గెలువలేము గెలుపలేము ఫేరిస్త్రీలను
మూడుపుట్ల నల్లమందుకే యుత్తరువియ్యము
ఈమాటలు విన్నాడయ్యా ప్రాంచిదొరగారు
టోపితీసి దిగువగొట్టెను ప్రాంచిదొరగారు
చేతివేలుకొరికెనయ్యా ప్రాంచిదొరగారు
మూడునిమిషముల తీసినాము మూడేదుర్గాలు
ఆరునిమిషంబులకు తీసినాము ఆరణిబళ్ళారి
ఇంతయుద్ధము నేనుయెక్కడ జూడనిలేదయ్యా
పల్లెబొబ్బిలి మీరుతెచ్చి పాపిష్టిరాజు
పల్లెబొబ్బిలి కాదురయ్యా పట్నంబొబ్బిలిదా
యీరీతిగా చెప్పినాడు ప్రాంచిదొరగారు
మూడుపుట్లనల్లమందుకే వుత్తరువు యిచ్చేను
యుత్తరువు తెచ్చినాడయ్యా హైదరుజంగోజి
మూడుపుట్ల నల్లమందు భూమినపరచేను
రవ్వలుచాల పరపించెను మందుకులోగాను
యిచ్చుకత్తులు సానకత్తులు మందునవేసిరీ
నాలుగుప్రక్కల మందులత్రాళ్లుతగిలించినారు
నిప్పుబెట్టె జాగులవారు వెంబడియున్నారు
మున్నూటికి కవాతుగుట్టము ముందుగనిలచెను
శ్రీరామరామయంటువారు వస్తువున్నారు
గుట్టమని దూకినారు ఫేరిస్త్రీలుదా

గుద్దుగుద్దుకె చంపినారు గుఱ్ఱములంతాను
పట్టాదెబ్బకు పదిమంది శాయిగ చచ్చిరి
కత్తులుత్రిప్పి పోయినదూరము సినుగులువడాని
యింతవరకు గాయము లేదు భేరిస్త్రీలకు
నాలుగుప్రక్కల త్రిప్పినారు కవాతుగురిము
తెలియకవచ్చి నల్లకుండులో గొబ్బునదూకిరి
నాలుగుప్రక్కల నిప్పులైన పెట్టిరివారపుడు
భగ్గుభగ్గున రగిలియపుడు మంటలు లేచెను
మలమలయని మాడినారు భేరిస్త్రీలుదా
యీరీతిగా చచ్చినారు భేరిస్త్రీలుదా
ఆలంగాలకే యెక్కినారు ప్రాంచిదొరంబాదా
అచ్చటయుండు వెండిబంగారుబండికియెత్తించి
బంగారువెండిడేరావద్దకు పంపించినాడు

పుట్టకోట పరిశుద్ధపరచిరి అరనిమిషములోను
పుట్టకోటలో జండాకొయ్య యెత్తించినారూ
పుట్టకోటపట్టుకున్నాడు ప్రాంచిదొరగారూ
రాజుగారి తెల్లజండా యెత్తించినారూ
మూలబురుజు క్రిందకువచ్చి మకాముచేసిరి
రామలక్ష్మణ పిరంగిలాడ మోహర్జాలెత్తిరి
అరవై మూడు లేఖలాలుగా మోహర్జాలెత్తిరి
వళపళమని కాల్చినారు ఫిరంగియపుడుదా
తొలుతదెబ్బకే మూలబురుజు బ్రద్దలాయెను
గడ్డగడ్డగా విరిగిబురుజు భూమినపడినాది
ఆలంగాలను యెక్కినాది ప్రాంచిదండుదా

మూలబురుజునవున్నాడయ్యా ముత్యాలపాపయ్య
యాబై ముగ్గురు యల్లాదొరలు చవుకివున్నారు
అప్పుడేనిమ చెప్పినాడయ్యా ముత్యాలపాపయ్య
అన్నలారా తమ్ములారా అన్నలారా రండు
మించివచ్చెను మించివచ్చెను యుద్ధమిపుడు దా
రంగయ్యతో జెప్పబోతే జాగుయౌతుంది
జగముయుండు కాలమువరకు వుండబోతామూ
యిచ్చటచచ్చినవారికిచాల వీరస్వర్గము
ధైర్యపుమాటలు చెప్పినాడు ముత్యాలపాపయ్య
ముందువెనుక చూడవద్దు దండుకులోగాను
మీదుబలము జూపుండయ్యా దండుకులోగాను
ఈరీతిగా చెప్పినాడు ముత్యాలపాపయ్య
బారాతేజిమీదనెయప్పుడు కొలువుతీరినాడు
చాబూకుతో తట్టినాడు బారాతేజిని
వారివెంబడివస్తున్నారు యల్మాబిడ్డలు
దండుమీదనే కలవటమైరి యల్మాబిడ్డలు
యెక్కివచ్చేపారించిదండును కన్నులచూచిరి
వచ్చినట్టి యీపెలతోను వాదులుచేసిరి
కోటవెలువడి దుమికినారు యల్మాబిడ్డలు
వానివెంబడి దుమికినారు యల్మాబిడ్డలు
మెడనుబట్టి వీపుమీద బాకునబొడిచిరి
మొకాలులోతున రక్తమక్కడ మొనసిపారేను
తిన్నటువంటి పప్పయన్నము ముద్దగబడినాది
దండుకుసూటిగ మనుష్యులను నరుకుతువస్తారు

అప్పుడేమని చెప్పినాడయ్యా హైదరుజంగోజి
ప్రాంచివారి చేటికివచ్చి హైదరుజంగోజి
సలామనగా టోపితీసెను ప్రాంచిదొరగారు
ఇప్పుడు జరుగు యుద్ధముచాల నెవ్వరిదన్నాడు
ముత్యాలపావయ్యయుద్ధముజరుగుతుయున్నాది
జయించలేము జయించలేము ప్రాంచిదొరగారు
రెండుపుట్లవల్లమందుకు వుత్తరువు లియ్యండి
రెండుపుట్లవల్లమందు భూమినపరచెను
రవ్వలునందుగలిపినారు మందుకులోగాను
నాలుగుప్రక్కల సిప్పులత్రాళ్ళు తగిలించినారు
భగ్గుభగ్గున మంటలుయప్పుడు భగ్గునరగిలేను
మందుకుముందుమమికినాడు ముత్యాలపావయ్య
వెంబడివచ్చి యల్మాబిడ్డలు మందునకూలిరి
వొంటిగానునిలిచినాడయ్య ముత్యాలపావయ్య
నిప్పులుబెట్టి జాతులవారి గొంతులుకోసేను
వేటువేటున నరికినాడు యేనుగులంతాను
యేనుగతొండము బట్టియప్పుడు నేలనుగొట్టేను
ఈరీతిగాయున్నాడయ్యా ముత్యాలపావయ్య
ప్రక్కలోని నిలిచియుండెను టుపాకిబారుదా
యాబై రెండు టుపాకులాడ టప్పునకాల్చిరి
గప్పుగప్పునకాల్చినారు టుపాకిలపుడుగా
ప్రక్కనతగిలిన గాయాలన్ని ఎంచతరముగాదు
వీపునతగిలిన గాయాలన్ని యెంచతరముగాదు
చుక్కలాగున టుపాకిదెబ్బ నెత్తినతగిలెను

కడుపుల పేగులు జీరాడెను ముత్యాల పాపయ్యకు
జీరాడె పేగులు యెత్తి ధట్టిలో బంధించె
సానదీరిన బల్లెంబును చేతనుబట్టెను
తరిమితరిమి పొడిచినాడు తొంబై మందిని
నిల్వజాలకపొయ్యెనయ్య పాపయ్యదొరలుదా
వీరి చేతిలో చావగ మనకు బ్రహ్మవ్రాసెను
ఈరీతిగా యోచించెను తాను ముత్యాలపాపయ్య
బాకుతీసిరొమ్మునపొడచి భూమినపడ్డాడు
భూమిమీద పడగానే ప్రాణమువిడిచెను
ముత్యాలపాపయ్య చచ్చాడని ఢంకాగొట్టిరి
మూలబురుజు పట్టుకొన్నారు ప్రాంచిదొరగారు
రాజుగారి తెల్లజండా యెత్తినారు యప్పుడు
ప్రాంచివారి నిశానికొయ్య యెత్తించినారు
నాలుగుకోటలు పట్టుకున్నారు ప్రాంచిదొరగారు
నాలుగుకోటలు కొల్లబోయెను బొబ్బిలిలోగాను
బొబ్బిలికోట దిగువవచ్చి మకాముచేసిరి
రామలక్ష్మణ ఫిరంగిలాడ మొహర్జాలెత్తిరి
డాక్వరంబులు త్రొవ్వించినాడు డాబాలుపెట్టించి
అరవై మూడు రేఖలుగా మొహర్జాలెత్తిరి
వళవళయని కాల్చినారు ఫిరంగిలంతాయు
దివాణమందు ఫిరంగిగుండ్లు దుముకుతున్నాది
అప్పుడెట్లావున్నాడయ్యా రంగయ్యదొరగారు
వచ్చునట్టి ఫిరంగిగుండ్లు కన్నులజూచెను
తటుక్కున లేచినాడయ్యా రంగయ్యదొరగారు

తమ్ముమ్మనియొక్క భేటికియప్పుడు వస్తుయున్నాడు
అప్పుడెట్లావున్నాడయ్యా వెంగళరాయుండు
కోడిపందెముఆడుతుదాను కొలువునయున్నాడు
తమ్ముడియొక్క బేటికివచ్చి రంగయదొరగారు
పరాకుంచక వినండిమీరు వెంగళరాయుడా
యింకయేలరా కోడిపందెము వెంగళరాయుడా
పట్టుకోట పుట్టుకోట కోళ్ళకుపోయింది
మూలబురుజు పట్టుకొన్నారు పాళించివారుదా
బొబ్బిలికోటలో ఫిరంగిగుండ్లుదుముకుతుయున్నాది
యుద్ధమిప్పుడు వచ్చెనయ్యా వెంగళరాయూడా
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
యింతలో ఫిరంగిగుండ్లు దుముకుతుయున్నాది
వచ్చెనట్టి ఫిరంగిగుండ్లు జవిరిపట్టినారు
గుండుతోనుగుద్దులాడెను వెంగళరాయుండు
అన్నకొలువున బెట్టినాడయ్యా వెంగళరాయుండు
తామసమేలనయ్యా వుత్తరువులియ్యండి
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
పరాకుంచక వినండిమీరు వెంగళరాయుండు
నీతోయున్నది నీతోయున్నది బొబ్బిలికోటదా
బొబ్బిలికోట కీర్తిపేరే మీరేతెన్నండి
మీదుబలములంతా దండులోచూపండి
ముందువెనుక జూడవద్దు వెంగళరాయుడా
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరగారు

అక్కడనుంచి శెలవులుతీసి వస్తువున్నాడు
దివాణమువద్ద వచ్చినాడు వెంగళరాయుండు
తన్నుకొలిచె రాణువలంత పిలపించినాడు
వందనమయ్యా వందనమయ్యా వెంగళరాయుడ
మమ్ముపిలిచినట్టికార్యమేమి వెంగళరాయుడ
ఈరీతిగా యడిగినారు రాణువలంతాను
అప్పుడేమని చెప్పినాడయ్యా వెంగళరాయుడు
పరాకుంచక వినుముయిప్పుడు యల్మాదొరలుదా
యుద్ధమునకు రావలెనయ్యా యల్మాదొరలుదా
నాతోకూడ రావలెనయ్యా యిప్పుడుమీరుదా
చావంటే భయపడపోకుము యల్మాదొరలుదా
వారివారి దివాణమునకు లగువులుయెత్తిరి
దివ్యమైన పరమాన్నమును భోంచేసినారు
తాంబూలము చేతనువట్టెను యల్మాదొరలుదా
జాజిపువ్వుల జల్లడములు దిగ్గునతొడిగిరి
కాసెమీదనే వీరకాశలు నడుమునగట్టిరి
పట్టుకుచ్చుసొగసు యీాటెలు బిరుదులుగట్టిరి
రామరామ రామయటంచు తయారుబడినారు
వెంగళరాయుని బేటికివచ్చి వందనమొసగిరి
తామసమేల యిప్పుడుమీరు తయారుకానిండి
కొట్టడీలు తెరచినాడు వెంగళరాయుండు
పెద్దలనాటి పెట్టెలయిప్పుడు నేలకుదించీరి
పెట్టెలు యప్పుడు తెరచినాడు వెంగళరాయుండు
సరిగెపాగా చక్కబెట్టెను వెంగళరాయుండు

సొగసైన అంగీదొడగె వెంగళరాయుండు
అంగీమీద బంగారువంటి ధట్టికట్టినాడు
కంఠహారము యెత్తియప్పుడు మెడనుధరించెను
భటులచూచి చెప్పసాగెను వెంగళరాయుండు
బారాతేజిని యిప్పుడు నాదు బేటికితెన్నండి
నేలమిద్దెలో భూమికాపులో తేజియున్నాది
పిల్లదిపిడుగు బారాతేజిని బేటికి తెస్తారు
వేసినారయ్యా తేజికక్కడ వెండికల్లెములు
కట్టినారు తేజికక్కడ కొంతాపల్లెములు
మెడలమీద జడలుయప్పుడు తాయిగవేసిరి
పట్టుతాళ్ళతో బంధించిరి బారాతేజీని
వెంగళరాయుని బేటికియప్పుడు తీసుకవచ్చిరి
తేజియొక్క శృంగారములే కన్నులచూచేను
చదురువిడిచి లేచినాడయ్యా వెంగళరాయుండు
చిన్నచెంబుతో వుదకమప్పుడు తెప్పించినాడయ్యా
తేజియొక్కనాల్గుపాదములు తానేకడిగెను
పాదములకు పూజచేసెను వెంగళరాయుండు
చుట్టివచ్చి వందనమొసగెను వెంగళరాయుండు
రికాబులోనె పాదములుంచె వెంగళరాయుండు
యెగిరినాదిరా బారాతేజి యోజనంబుపొడుగు
నడిచినాదిరా బారాతేజి నందముగానుదా
నాలుగుప్రక్కల త్రిప్పినాడు బారాతేజీని
యీాబై ముగ్గురు యల్మాదారలు వెంటనెవచ్చిరి
తట్టుకోట జండాకొయ్యా కన్నులచూచేను

యెంచరానికోపముగలిగె వెంగళరాయుడికీ
పుట్టకోటలోపాగించివారు పారాలున్నారు
యల్మాబిడ్డలతిరిగియప్పుడు కన్నులజూచేను
ముందువెనుకజూడవద్దు యల్మాదొరలారా
సైగచేసి నడచినాడు వెంగళరాయుండు
పారామీద కలపటమైరి పారాదొరలుదా
రెండుచేతుల పట్టాకత్తుల త్రిప్పుచువచ్చిరి
పారాలమీదనె పోయిదూకెను వెంగళరాయుండు
కళీవళీ కళీవళీయంటూ కార్యముజూపేను
పుట్టకోటలో యుండేపారా సావుచేసినారూ
జండాకొయ్య నరికిత్రోచెను భూమికిపైగాను
పుట్టకోటను బట్టుకొన్నాడు వెంగళరాయుండు
తట్టుకోటపారాలమీద కలపటమైనారు
తట్టుకోటపారాలలన్ని చంపిత్రోసినాడు
తట్టుకోటలో జండాకొయ్యను భూమిలోదాచీరి
తట్టుకోట పట్టుకున్నాడు వెంగళరాయుండు
మూలబురుజు పారాలమీదు కలపటమైనారు
మెడనొంచి వీపున గుద్దిరి బాకుతో యప్పుడుదా
మూలబురుజుపారాలన్ని సావుగజంపీరి
కోటకుబైట ధుమికినాడు వెంగళరాయుండు
వానివెంటనే ధుమికినారు యల్మాదొరలుదా
కాలుత్రోను సైగచేసే బారాతేజీని
అగడ్తకెబండీ దూకించెను బారాతేజి
నాలుగుదిక్కులు చూచినాడు వెంగళరాయుండు

వెటుప్రక్కచూచినగాని దండేయున్నది
అన్నలార తమ్ములార యల్మాదొరలార
ముందువెనుక జూడవద్దు యల్మాదొరలార
చచ్చెడివారికి వీరస్వర్గము యిక్కడగలుగును
జగముయుండు కాలమువరకు యుండబోతామా
ధైర్యపుమాటలు చెప్పినాడయ్యా వెంగళరాయుడు
ధైర్యపుమాటలు చెప్పితనదు తయారుబలమూను
పూలకోత కోయించినాడు వెంగళరాయుడు
సూర్యనోను వీధులక్కడ యేర్పరించినాడు
హెహాళ్యాహెహాళ్యాలు యని తరిమినరికినాడు
వంచినయీతలమీదనువారు వాదులుయాడిరి
ముక్కముక్కలుగా నరికినాడు వెంగళరాయుండు
మోకాలిబంటి రక్తముయాడ మెండుగచేసేను
రక్తములోనే మొండెములన్ని పైకితేలినావి
వేటువేటుకు నరికినాడు యేనుగులన్నియు
గుద్దిగుద్ది చంపినాడు గుఱ్ఱాలపౌజుదా
శలగోశలగోయంటు వారు వస్తువున్నారు
పోయినంతదూరముదాక పీనుగబడ్డాది
అన్నలార తమ్ములార యల్మాదొరలారా
భటులనుచంపిన సార్ధకమేమి యల్మాదొరలారా
రాజుగారిని చంపిమనము పేరెత్తవలెను
ప్రాంచివారిని చంపిమనము పేరెత్తవలెను
ప్రాంచివారి డేరాప్రక్కను 'గుఱ్ఱాన్ని త్రిప్పిరి
అప్పుడేమని చెప్పినాడు ప్రాంచిదొరగారు

యిప్పుడు జరిగే యుద్ధముచాల యెవరిదన్నాడు
వెంగళరాయుని యుద్ధముయిక్కడ జరుగుతుయున్నాది
యధికదండు హతమైపోయెను ప్రాంచిదొరలుదా
డేరాకాడికి వస్తువున్నడు వెంగళరాయుడు
వెంగళరాయుడు యిక్కడకువస్తె జయించలేమండి
ఈరీతిగ చెప్పినాడయా హైదరుజంగోజి
ఈమాటలు విన్నాడయ్యా ప్రాంచిదొరగారు
యేనుగనెక్కి కొండప్రక్కకు ప్రాంచివెళ్ళెను
ప్రాంచిపోయిన సంగతి విన్నాడు విజయరామరాజు
గుఱ్ఱముయెక్కి వచ్చినాడు విజయరామరాజు
యేరుదాటి వేలూరికిపోయె విజయరామరాజు
ప్రాంచివారిడేరావద్దకు వచ్చినిలచినాడు
ప్రాంచివారి డేరాలోగా పోయిజూచినాడు
పాంచిలేడు యెవరులేరు డేరాలోగాను
యెంతటీబలశాలివినీవు ప్రాంచిదొరగారు
మీసములేని యల్పుడునీవు ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి బలమునీకు తెలిసేయున్నాది
తెలిసియుండి బొబ్బిలికోటకు యేలవస్తివి
వచ్చినవాడవు యెదుటయుండక యెందుకుబోతివి
డేరాటంగులు తెంపినాడయ్యా వెంగళరాయుండు
డేరాగుడ్డలు చింపితోసెను వెంగళరాయుండు
కిందుమీదుగ జేసినాడయ్యా ప్రాంచిడేరాలు
రాజుగారిడేరావద్ద గుఱ్ఱాలతిప్పెను
డేరాలోగ శోధించినాడు వెంగళరాయుండు

రాజులేడు యెవ్వరులేరు డేరాలోగాను
యెంతగొప్పబంటువునీవు విజయరామరాజ
కొప్పుబెట్టికోకలుగట్టి కోటలోయున్నావా
హీనమానములేనివాడవు యెందుకువస్త్రీవి
నీతాతతండ్రులు బొబ్బిలిమీద హతమైపోయిరి
తెలిసియుండి బొబ్బిలికోటకు యేలవస్త్రీవి
డేరాలన్ని సరికితోచెను వెంగళరాయుండు
రచ్చాబండారేపులకాడ గుఱ్ఱాని త్రిప్పేను
నిమిషమువరకుదా నిధానించెను వెంగళరాయుండు

భావమరది రాకయప్పుడు జూస్తుయున్నాడు
పాపారాయుడు రాకయప్పుడు జూస్తుయున్నాడు
యెంతజూచినగాని రాలేదయ్యా పాపారాయుండు
అప్పుడేహాని చెప్పినాడయ్యా వెంగళరాయుండు
లాల్ఖానుడేరాయప్పుడు కన్నులజూచెను
గుడారముచూచినంతలో కోపమువచ్చెను
యంతలోకి యేమన్నారు యల్మాదొరలూదా
దాహముదాహముదాహము మాకు వెంగళరాయుడ
కోటకుపోయి దాహముతాగి తిరిగివస్తాము
యీరీతిగా చెప్పినారయ్యా యల్మాదొరలుదా
లాల్ఖానునిడేరాయందు కన్నులజూడండి
డేరాయందు సంగతితెలిసిన యాకలియెత్తునా
లాల్ఖానునిచంపిమనము కోటకుపోతాము
కోటకుపోయి దాహముతాగి తిరుగవస్తాము
యీరీతిగా చెప్పినాడయ్యా వెంగళరాయుండు

యెంతజూచిన శాలేదయ్యా పాపారాయుండు
లాల్ఖానుడు దండువద్దకు వస్తువున్నాడు
అప్పుడెట్లాయోచించెను లాల్ఖానుడై తేను
మూడుపుట్లనల్లమందు భూమినపరచేను
భూమినపరచి యప్పుడెవాడు మందుకులోగాను
కారుకత్తులు యీటెకత్తులు మందులోవేసెను
మున్నూటికి కవాతుగుఱ్ఱం ముందుగ నడపించె
రామరామరామయంటు వస్తుయున్నాడు
గురర్రుమని దూకినారు యల్మాదొరలుదా
తెలియకవచ్చి నల్లమందులో యప్పుడెబడ్డారు
నాలుగుపక్కల జానకిత్రాళ్ళు తగిలించినారు
భగ్గుభగ్గున రగిలెనయ్యా మందులయంతాను
మందుకువెలువడి దుమికినాడు వెంగళరాయుండు
కూడయున్న యల్మాబిడ్డలు మందునజచ్చిరి
వొంటిగానునిలచెనయ్యా వెంగళరాయుండు
నిప్పుబెట్టిజాతులవారిని గొంతులుకోసెను
యుద్ధముచాలాచేస్తున్నాడు వెంగళరాయుండు
మందుచుట్టుపారాలన్ని సాపుజేసినాడు
చక్కగా నిలచియుండు టుపాకులబారు
అరవై రెండుటుపాకులాడ టుప్పునకాల్చిరి
వళపళయని కాల్చినారు టుపాకిలంతాను
చుక్కవంటి టుపాకిదెబ్బ నెత్తినతగిలెను
వీపునతగిలినగాయాలన్ని యెంచతరముగాదు
చూరునీళ్ళలోగున రక్తము కారుతున్నాది

కండలుపేగులుజీరాడేను వెంగళరాయుడికీ
జీరాడె పేగులుయెత్తి దట్టిలోగట్టెను
వాడిగలిగినబల్యెమప్పుడు చేతయెత్తినాడు
తరిమి తరిమి నరికినాడయ్యా తొంబయిమందిని
నిల్వజాలకమూర్ఛజెందెను వెంగళరాయుండు
వెంగళరాయుండుచచ్చినాడని ఢంకాకొట్టిరి
ఢంకాశబ్దమువిన్నాడయ్యా కీనుమదాలుదా
వచ్చలపల్లకియెత్తినారయ్యా కీనుమదాలుదా
రెండుచేతుల వట్టాకత్తులు త్రిప్పుచుయప్పుడుదా
దండుకులోగాదూరినాడు కీనుమదాలుదా
రచ్చాబండ రేవులకాడ తాయిగవచ్చిరి
వెతుకుతువెతుకుతు వస్తున్నాడు కీనుమదాలుదా
వెంగళరాయుని బేటికివచ్చి కీనుమదాలుదా
వచ్చనివల్లకియందు తాము కొల్వుతీర్చినారు
పన్నెండుమంది భోయవారు వల్లకియెత్తిరి
రాజదివాణముకు తెచ్చినారయ్యా వెంగళరాయున్ని
హాజారము యెదుటకువచ్చెను రంగయ్యాదొరగారు
పల్లకిలోని తమ్ముడుయప్పుడు బ్రితికియున్నాడు
పల్లకియప్పుడె దింపినారు రంగయ్యాదొరగారు
రవ్వాశల్లముసుగుయెత్తి కన్నులచూచెను
ఘోరుఘోరున దుఃఖించెను రంగయ్యాదొరగారు
కుడిభుజము కూలిపోతివి వెంగళరాయుడా
యెంతటిదండులో పోరుచేసితివి వెంగళరాయుడా
యీరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యాదొరగారు

అంతలోగా మూర్ఛదెలిసెను వెంగళరాయుండు
కంటివుండు నీరుబెట్టెను వెంగళరాయుడు
యుద్ధమునకుపోతావేమో చావేయున్నాది
యుద్ధమునకు పోతివంటె కోటకురావయ్యా
రాజస్త్రీలకు పాలించికూడు తినిపించవద్దు
కోటలోపల కాలిబందకం శానావున్నాది
బందకాలువదలించుకొని తాయిగపొన్నండి
యిన్నిమాటలు చెప్పియప్పుడు జీవమిడిచినాడు
జిల్లగుంటబయులునందు చిచ్చుబరిపించి
దహనమప్పుడు చేసినాడు వెంగళరాయున్ని
మూడునిముషములకు నిత్యకర్మము తానుజేసికోని
కొలువుచావిడికి వచ్చినారు రంగయదొరగారు
సొగసుదిండ్లు దివాసిమీద కొలువుతీరినాడు
తన్నుకొలిచే రాజువలంతా కొలువుకు వచ్చిరి
యీకథలు యీలాగునన్నది కోటకులోగాను
మరిదిచచ్చిన సంగతియెరిగెను మల్లమ్మదేవిదా
పెద్దకూతురు సీతమ్మను దాను పిలచుకొని
తోడికోడలు సుభద్రమ్మను తానుపిలచుకోని
యేడుగురుమేనత్తలను తానుపిలచుకొని
కోటలోయుండు గోపాలస్వామి దేవాలయమునకు
దేవాలయమునకు కదలివచ్చెను దేవీమల్లమ్మ
అభిషేకమునుచేసిపెట్టెను స్వామికియప్పుడుదా
జాజిమల్లెల పువ్వులవల్ల పూజలుచేసేను
తులసిదళము చేత స్వామికి పూజలుచేసేను

స్వామియొక్క శిరమునకు కిరీటము పెట్టెను
స్వామి నెత్తికి తిరుమణి వెండి తాయిగ పెట్టెను
స్వామిభుజములకు శంఖుచక్రములు బెట్టెను
నాలుగునూరు చిన్నదివ్వెలు వెలిగించినాది
యెదుటివీధుల గోపాలస్వామిని వేడుకొన్నది
కలలోవచ్చి సహాయముచేయుము గోపాలస్వామి
అన్యాంబు పుణ్యాంబుదా తెలియ జెప్పండి
యెదుటనిలిచి వేడుచున్నది గోపాలస్వామిని
కంటినిండ నీరుపెట్టెను గోపాలస్వామిదా
అపశకునంబులు చెప్పుతుయున్నాడు గోపాలస్వామిదా
నొష్టయున్న తిరుమణిరేఖ నేలనుబడ్డాది
మెడలోయున్న పూలహారము తెగినేలబడెను
యెదుటయున్న యఖండదీపము గప్పునయారెను
తూర్పునయున్న గోపాలస్వామి పడమటతిరిగెను
పడమటయున్న గాలిగోపురము పటపటపగిలింది
కానరాని చీకటియప్పుడు కమ్మెనుగుడిలోన
గుడివిడిచి బైటికివచ్చెను మల్లమ్మదేవిదా
ఆలంగారము యెక్కినాది మల్లమ్మదేవిదా
రాజుగారిడేరాయప్పుడు కన్నులచూచెను
మమ్మ్మచంపయెన్నాళ్ళనీవు మనస్సువుంచినావు
కొండలుబడ్డ కొన్నాళ్ళకైనా కోనలువడుతుంది
దోవలోకబురు వింటాడయ్యా పాపారాయుండు
రేయిరేయివస్తాడయ్యా పాపారాయుండు
పట్టెమంచం పరువుమీాది పవ్వళించియుండగా

వొక్కపోటుపొడుస్తాడయ్యా పాపారాయుండు
పుట్టెడునల్లెలు పుట్టెడుగాజులు యొక రేవులోన
నీదు పెండ్లాము తెంచను యిప్పుడు జాతకమున్నాది
రాజదివాణము వచ్చినాది మల్లమ్మదేవిదా
సంవత్సరముగల చిన్నవాడు వెంకటాద్రియుడు
బాలునియిప్పుడు యెత్తుకున్నది మల్లమ్మదేవిదా
చెక్కిళ్ళుదువ్వి చేరిముద్దులాడె మల్లమ్మదేవిదా
కొడుకాకొడుకాకొడుకానీవు వెంకట్రాయుడా
తల్లికడుపుననోచిననోము వెంకటాద్రియుడా
కడపటిసారి స్తన్యపానము తాగురనాతండ్రి
గర్భమునిండ స్తన్యపానము తానెయిచ్చెను
బంగారుగజ్జలు అన్నియుతాను తీసివేసినాది
కాళ్లనుండి కడియాలన్ని తీసివేసినాది
మారువేషము వేసినాది బాలునికై తేను
యెందరికైనా పెద్దదాది వెంకటలక్ష్మమ్మ
వెంకటలక్ష్మమ్మను గొలువునకు తానుబిలిచినాది
కందలువంటి చీరగట్టెను వెంకటలక్ష్మమ్మ
మసిబొగ్గు బెట్టెనయ్యా దుత్తకుయిప్పుడుదా
డేరాడేరా వద్దనీవు భిక్షమెత్తుకొని
రాజారము చేరవలెను వెంకటలక్ష్మమ్మ
పాపారాయుని బేటికియివ్వకు మీ రేపొన్నండి
ఈరీతిగ చెప్పినాది మల్లమ్మదేవిదా
యిక్కడజరిగిన సంగతులన్నియు యింపుతో చెప్పండి
చాపకన్నదరవాజగుండా వారువెళ్ళినారు

అచ్చటనుండివచ్చినాది వెంకటలక్ష్మమ్మ
డేరాడేరావద్దయప్పుడు బిక్షమెత్తింది
పాంచివారి దండుకలోగా భిక్షమెత్తుకోని
భిక్షమెత్తుకొని వస్తువున్నాది వెంకటలక్ష్మమ్మ
ఆవేళలో రాజుగారు షామిలై నారు
డేరాబైట కొలువుతీరిరి వేడుకకొరకూను
రాజుగారి చుక్కాని పరీక్ష చెప్పతుయున్నారు
సలామయ్యా సలామయ్యా పాంచిదొరగారు
పరాకులేకవినుమయ్య ప్రాంచిదొరగారు
బొబ్బిలివారి పోతుదూడదా వెలవటపోతాది
రాజామరియీ చిన్నవాడు వెలుపటపోతాడు
పోనివ్వకు పోనివ్వకు బాలునియై తేను
చుక్కానియప్పుడు చేతికందెను ప్రాంచిదొరగారు
చుక్కానిలో జూచెనయ్యా పాంచిదొరగారు
వరాకుంచకవినుము యిప్పుడు విజయరామరాజు
మన్మధుని సమానముగా పిల్లడు యున్నాడు
చంపరాదుర చంపరాదుర బాలునిగనుకాను
ఈరీతిగా చెప్పినాడయ్యా పాంచిదొరగారు
ఈమాటలువిన్నాడయ్యా విజయరామరాజు
ముందుముందు సాధించబోతాడు బాలుడై తేను
శెలవివ్వండి శెలవివ్వండి పాంచిదొరగారు
అట్టిమాటలకు యేమున్నాడు పాంచిదొరగారు
హర్కారులను పిలిపించెను పాంచిదొరగారు
వెంకటలక్ష్మి బేటికివచ్చిరి హర్కారులప్పుడుదా

నీదు పేరు యేమన్నారు హర్కారులప్పుడు దా
నాదు పేరు వెంకటలక్ష్మి యని పేరు జెప్పినాది
యేయూరు యేపల్లె వెంకట లక్ష్మమ్మ
కోటలకింద పేటలు మూది పారాచౌకీలు
భిక్షమెత్త బోతున్నాను పారాచౌకీలు
పాంచివారు పిలువుమన్నారు వెంకటలక్ష్మమ్మ
ప్రాంచివారి డేరావద్దకు తీసుకవచ్చిరి
కోటలకింద పేటలుమూది పాంచిదొరగారు
భిక్షమెత్త బోతున్నాను ప్రాంచిదొరగారు
మైల వేషము వేసినాది వెంకటలక్ష్మమ్మ
రంగారాయుని ముద్దుకుమారుడు వెంకటారాయుడు
యింతలోపల యేమన్నాడు విజయరామరాజు
పోసివ్వద్దు పోనివవద్దు వెంకటరాయున్ని
ఆమాటలకు యేమన్నాడు ప్రాంచిదొరగారు
పాపకర్ముడు బహుచండాలుడు విజయరామరాజు
కర్మచండాలుడు కులద్రోహుడు విజయరామరాజు
నెత్తురుముద్దచంపవద్దుర విజయరామరాజు
యింతలోపల మరి యేమన్నాడు విజయరామరాజు
చూడగావసిబాలుడయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలి వారిబలమునుమీరు పరీక్షచూడండి
యీరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
యిన్నిమాటలు విన్నాడయ్యా పాంచిదొరగారు
బాలునియప్పుడు చేతతీసెను ప్రాంచిదొరగారు
చెక్కిళ్లయినా దువ్వినాడు బాలుని అయితేను

తొడపై కూర్చుండబెట్టె బాలునిఅయితేను
వొక్కప్రక్క పండ్లుఫలాదులు రాసిబోసినాడు
వొక్కపక్క చంద్రాయుధము తానుబెట్టినాడు
బాలునియప్పుడు విడిచిపెట్టెను విజయరామరాజు
చూచితెపీడు బాలుడయ్యా ప్రాంచిదొరగారు
బొబ్బిలివారిబలములంతా కన్నులచూడండి
బోగాడుతువచ్చినాడయ్యా వెంకట్రాయుడు
పండ్లుఫలాదులు తాకలేదు వెంకట్రాయుడు
దుడ్డుదుగ్గాని తాకలేదయ్యా వెంకట్రాయుడు
చంద్రాయుధము వద్దకువచ్చె వెంకట్రాయుడు
మండవేసి కొలువుతీరెను వెంకట్రాయుడు
చంద్రాయుధము చేతబట్టెను వెంకట్రాయుడు
ప్రాంచివారిని వురిమిచూచెను వెంకట్రాయుడు
రాజుగారిని వురిమిచూచెను వెంకట్రాయుడు
దిగులుజెండెదివుంనయ్యా ప్రాంచిదొరగారు
తగురానాయన తగురానాయన బొబ్బిలివారికి
కౄరకర్ముడా కులద్రోహుడా విజయరామరాజా
యింతటివస్తాదిబిడ్డలు బొబ్బిలిదొరలుగా
యెంతదూరముబోతున్నావే వెంకటలక్షుమమ్మ
యింకొకరాజ్యము సేనిప్పుడు పోతువున్నాను
మంచిదన్నాడు బాగన్నాడు ప్రాంచిదొరగారు
రాజుగారిని నమ్మలేక ప్రాంచిదొరగారు
ముప్పయిదింటి సోల్జరులను యిప్పుడుబిలచెను
గాటుయొక్కపారాలిప్పుడు గట్టిగపెన్నండి

మెచ్చటినుండి పొమ్మంటాదో వెంకట లక్షుమమ్మ
అచ్చటనుండి రావలెనయ్యా పారాచౌకీలు
యీరీతిగా చెప్పినాడయ్యా ప్రాంచిదొరగారు
అక్కడనుంచి వచ్చినారయ్యా పారాచౌకీలు
నల్లకొండ దాటినారయ్యా పారాచౌకీలు
కొంతదూరము వచ్చినారయా పారాచౌకీలు
రాజారంపు సమీపమున కదలివచ్చినారు
అక్కడనుంచిపొమ్మన్నాది వెంకటలక్ష్మమ్మ
రాజారంపుబాటలు తొక్కిపోతూవున్నాది
ఆకథలు ఆలాగున్నది దారికిలోగాను
కోటలోపల యున్నాడయ్యా రంగయ్యదొరగారు
ఆలోచనలు జేసినాడు రంగయ్యదొరగారు
బావమరిది నర్సారాయుని కొలువుకుబిలచేను
కొలువుకుయప్పుడు కదలివచ్చెను నర్సారాయుండు
బావమరిది బేటికివచ్చి వందన మొసగెను
పరాకుంచక వినుముయిప్పుడు నరసారాయుడా
కోటలోపల కాలిబందము చాలాయున్నది
బందకాలు వదలించుకోని నాబేటీకిరన్నండి
చేతయున్న పట్టాకత్తి చేతికియిచ్చెను
పట్టాపత్తి తీసుకొన్నాడు నరసారాయుండు
యేమి తెలియక నిలిచినాడు నరసారాయుండు
దగ్గరికప్పుడు పిలిచినాడయ్యా నరసారాయున్ని
చిటికెవంటి విభూతిని తాను మంత్రించినాడు
విభూతిఎత్తి నొష్టబెట్టెను నరసారాయుడికి

ఓంచరాని కోపముగలిగె నరసారాయుడికి
రాజదివాణం వచ్చినాడయ్యా నరసారాయుడు
మల్లమ్మదేవి ముందుకొచ్చెను నరసారాయుడు
పగడశాల ఆడుతువున్నాది మల్లమ్మదేవిదా
అన్నతమ్ముని కన్నులచూచెను మల్లమ్మదేవిదా
పెనిమిటియొక్క పట్టాకత్తిని కన్నులచూచెను
పరాకుంచక వినుమయ్యా అన్నయ్యాదొరగారు
వచ్చినపనులు కానివ్వుమయ్యా నరసారాయుడా
వెనుకయున్న కీలుగంటు ముందుగ వేసేను
కొయ్యుమని మెడచాపెను మల్లమ్మదేవిదా
గరగరగరగర గరగరయంటు గొంతుకోసినాడు
పెద్దకూతురు పెరుంద దేవిని గొంతుకోసినాడు
నడిమికూతురు కాంతమ్మను గొంతుకోసినాడు
చిన్నకూతురు సీతమ్మ గొంతుకోసినాడు
యేడుగురైన మేనత్తల గొంతుకోసినాడు
తోడికోడలు చంద్రమ్మను గొంతుకోసినాడు
ధర్మారాయుని భార్యయైన రమణమ్మదేవిదా
నిండుగర్భమున యున్నాదయ్యా రమణమ్మదేవిదా
అప్పుడేమని పలికినాడు నరసారాయుడు
అంటరాదు ముట్టరాదు రమణమ్మదేవిదా
మొలలోయున్న చంద్రాయుధము బుజ్జునదూసేను
బాకుఎత్తి ముందర వేసె నరసారాయుండు
అప్పుడేమని చెప్పినాదిర రమణమ్మదేవి
మండెవేసి కొలువుదీరెను రమణమ్మదేవి

బాకుయెత్తి రొమ్మునవేసి భూమినవడ్డాది
గర్భముయప్పుడు చీల్చినాడు నరసారాయుడు
నెత్తురుముద్ద శిశువునుదాని యెగరవేసినాడు
పట్టాకత్తిని యెదుటబెట్టెను నరసారాయుఁడు
వేటుకుయొకటి తునకలురెండు భూమినవడ్డాది
బంధకాలు వదలించుకోసి నరసారాయుడు
రంగరాయుడు జేటికివచ్చెను నరసారాయుడు

బంధకాలు తీర్చుకొని బావరంగయ్యా
తన్నుగొలిచే రాణువలంతా తానుబిలచినాడు
మీబంధకాలు వదలించుకొని నాబేటికిరన్నండి
యీరీతిగాచెప్పినాడయ్యా రంగయ్యదొరగారు
వారివారి దివాణమునకు కదలివచ్చిరి
తలలుబట్టి గొంతులుకోసిరి యల్మాదొరలుదా
భార్యలనంతయు గొంతులుకోసిరి యల్మాదొరలుదా
బిడ్డలనంత గొంతులుకోసిరి యల్మాదొరలుదా
వారివారి బంధకాలు వదలించుకొన్నారు
కోమటివీధులు బ్రాహ్మణవీధులు వూరావున్నావి
యెందరిని చంపుదుమయ్యా రంగయ్యదొరగారూ
మందుగిడ్డంగివగులగొట్టండి మందులవరచండి
మందులకొట్టడిలోపలయప్పుడు స్త్రీలను దొరలించి
తల్పులుమూసి తగలపెట్టండి యల్మాదొరలారా
ఈరీతిగా చెప్పినాడయ్యా రంగయ్యదొరలుదా
మందుగిడ్డంగివగలకొట్టిరి యల్మాదొరలుదా
గుంపులుగాను రగిలినారు స్త్రీలందరును

దీపము బెట్టను దిక్కు లేదు కోటకు లోగాను
రంగారాయుని చేటికివచ్చిరి యల్మాదొరలూ దా
తామసమేమి యింకా మీరు తయారుగనుండి
బంగారువెండినంతయు తెప్పించెను రంగయ్యదొరగారు
ఇనుపయొక్క హుండీలను తెప్పించినాడు
హుండీలోవల వేసినాడయ్య రంగయ్యదొరగారు
యినుపగొలుసులు తగిలించిరి హుండీలకునుడా
యినుపరోళ్ళు తెప్పించినాడు రంగయ్యదొరగారు
గొలుసులకు దగిలించెను రోళ్ళంతాను
బావిలోన దింపినాడయ్య ఆస్తియంతాను
బండ వేసిపైనమూసె రంగయ్యదొరగారు
బండలమీదశాసనంబు వ్రాసెనప్పుడుదా
లేచిరలగోత్రమునకు యెవగువచ్చితేను
ఆస్తియంతయు వారికియింపుగ చిక్కవలెనుగా
యితరులొచ్చిన చిక్కరాదుయీ ఆస్తిఅంతయు
ఈరీతి శాసనములువ్రాసెను రంగయ్యదొరగారు
మూడుమనుష్యుల తలపుర్రెలను తెప్పించినాడు
నెత్తురుకూడు చల్లించినాడు రంగయ్యదొరగారు
రణమోరణమోరణమోయంటా రణముకున్వినాడు
బారాతేజని యప్పుడు తా తెప్పించినాడు
తన్నుగొలిచె రాణువలంతా ప్రయాణమైనారు
కోటవిడచి బైటకివచ్చెను రంగయ్యదొరగారు
కోటప్రక్కన తిరిగిచూచె రంగయ్యదొరగారూ
వందనము చేసే కోటకుయప్పుడు రంగయ్యదొరగారు

నేటివరకు నీకుమాకు ఋణముతీరెను
దండుప్రక్కతిరిగినాడు రంగయ్యదొరగారు
బావమరది నరసారాయుడు రంగయ్యదొరగారు
బావమరది ధర్మారాయుడు వెంటనేవస్తారు
అన్నలార తమ్ములార యల్లాదొరలార
ముందువెనుక జూడవద్దు దండుకులోగాను
మీదుబలములు జూపండయ్య దండుకులోగాను
అనంతకాలము మనముయేమి రాజ్యమేలలేము
చచ్చినవారికి వీరస్వర్గము యిక్కడగలుగును
యిట్లుధైర్యములు చెప్పినాడు రంగయ్యదొరగారు
దండుమీదకలపడ్డారి యల్లాదొరలూదా
చుట్టుప్రక్కల యున్నాదయ్యా ఫ్రాంచిదండుదా
వంచివంచి యీటెలతోను వాదులాడినారు
చేతులుబట్టి యుప్పుడువారు చెలగిగుమ్మినారు
మెడనుబట్టివంచియుప్పుడు బాకునగుమ్మిరి
యుద్ధములోనె జోరబడ్డాడు రంగయ్యదొరగారు
మోకాలులోతు రక్తమక్కడ పారుతుయున్నాది
కావుకావుమని ఫ్రాంచిదండు కొండకేగిరి
కొండగుహాలోదాగినారు ఫ్రాంచిదండుదా
అప్పుడేమని చెప్పినాడు రంగయ్యదొరగారు
వీరినిచంపితేసార్థకమేమి యల్లాదొరలారా
రాజుగారిని చంపితెమనకు పేరుగలుగును
ఫ్రాంచివారిని చంపితేను పేరుగలుగును
ఫ్రాంచివారిడేరావద్దకు గుర్రముత్రిప్పేను

పాంచివారి డేరాకొచ్చెను హైదరుజంగోజి
యిప్పుడుజరిగేయుద్ధముచాలా యెవ్వరిదన్నాడు
రంగయ్యదొరగారియుద్ధముచాలా జరుగుతయున్నాది
పట్నపుదొర రంగయ్యగారు వస్తువున్నాడు
తెలియకమనముచంపినాము బొబ్బిలిదొరలాను
కర్మచండాల రాజుమాటలు మనమే వింటిమి
యీవిధంబున జెప్పినాడు హైదరుజంగోజి
ముప్పైయింటికి వుక్కుజీరవు రైతులపిలపించి
అప్పుడేమని చెప్పినాడయ్య పాంచిదొరగారు
పరాకుంగకవినుము యిప్పుడు పారాచౌకీలు
బొబ్బిలిదొర రంగారాయుడు వస్తువున్నాడు
రంగారాయుని యెదురుగమీరు తాయిగపొన్నండి
కోలుకోలుయంటు మీరు యెదురుగ పొన్నండి
యేమికోలుయని యడిగితే రంగయ్య దొరగారు
యెప్పటివలెనే బొబ్బిలికోటకు యేలుకొనరండి
మరల వుత్తరువు తెన్నండోయి హర్కారులుమీరు
యీరీతిగా చెప్పినాడయ్య ప్రాంచిదొరగారు
రంగారాయుని యెదుటకువారు తాయిగవచ్చిరి
కోలుకోలుయంటు వారు యెదుటనెవచ్చిరి
యేమికోలు మాకిస్తారు మాయన్నలారమీరు
యెప్పటివలెను బొబ్బిలికోటలు యేలుమన్నారు
అట్టిమాటలకు యేమన్నాడు రంగయ్యదొరగారు
చాలుచాలు చాలించవోయి రైతులుమీరుదా
అన్నతమ్ములు బావమరుదులు యందరుచచ్చిరి

వొంటిగాన్ని నేనై తిని కోటలుయెందుకు
కన్నుసైగ చేసినాడు రంగయ్యదొరగారు
మున్నైయింటికి వుక్కుజీరపు రౌతులచంపిరి
గిరగిరమని తిరిగి కూవ్వాడు భూమినపడ్డారు
మరువుత్తరువులేకపోయె పాపించివారికిని
అప్పుడెట్లావున్నాడయ్య ప్రాంచిదొరగారు
యేనుగయెక్కి కొండలపక్క ప్రాంచివెళ్ళెను
ప్రాంచిపోయిన సంగతి తెలిసెను విజయరామరాజు
యేరుదాటియేలూరికి తానువెళ్ళినాడు
అక్కడనుంచి వచ్చినాడు రంగయ్యదొరగారు
పాపించివారిడేరావద్దకు తాయిగవచ్చిరి
డేరాలోగా శోధించెను రంగయ్యదొరగారు
పాపించిలేడు యెవ్వడులేడు డేరాలోగాను
యెంచరాని కోపముగలిగె రంగారాయుడికి
పిరికిబంటు పీడయిప్పుడు యెందుకువచ్చెను
మీసములేని పేడివాడు యెందుకువచ్చెను
పాపించివారిదండుకుపయిగా బాగుగవచ్చెగా
అచ్చటినుంచి వస్తున్నాడు రంగయ్యదొరగారు
రాజుగారిడేరావద్దకు తాయిగవచ్చిరి
రాజులేడు యెవ్వరులేరు డేరాలోగాను
పరాకుంచకవినుముయిప్పుడు విజయరామరాజు
బొబ్బిలివారిబలమునీకు తెలిసేయున్నాది
నీతాతతండ్రులుబొబ్బిలిమీద హతమయిపోయిరి
పుట్టినచోట చావడానికి బ్రహ్మవ్రాయలేదు

బొబ్బిలిమీద చావడానికి బ్రహ్మవ్రాసినాడు
హీనముమానములేక యిప్పుడు యెందుకువస్తివి
మానములేక యేలనీవు యిక్కడికొస్తివి
వచ్చినవాడవు యెదుటనిలువక యేలబోతివి
యీలాగు చెప్పినాడు రంగయ్యదొరగారు
డేరాగుంట త్రాళ్ళనుయిప్పుడు తెంపుగ తెంపిరి
క్రిందుమీదు చేసినాడు డేరాలంతాను
రాజుగారిగుండెమీదను తాయిగపొడిచేను
డేరావిడిచి బైటికివచ్చెను రంగారావుదా
నాతమ్ముడుచిచ్చినచోటుపదిర యన్నలారయిప్పుడు
లాల్కానునిడేరాయప్పుడు కన్నులచూచెను
లాల్కానుని డేరావద్దకు గుఱ్ఱముత్రిప్పెను
దండుకుమీద కలపటమయిరి యల్మాదొరలుదా
హాళ్యాహాళ్యాలుచేసియప్పుడు తరిమినరికినాడు
యచ్చటయున్న పారాలన్ని సాపుగజంపిరి
లాల్కానుని బేటికివచ్చె రంగారావుదా
అప్పుడెట్లాయున్నాడయ్యా లాల్కానుడుదా
యేనుగుమీదు అంబారిపై కొలువైయున్నాడు
తేజనియప్పుడు చిమటాయిచ్చెను రంగారావుదా
యేనుగులయొక్క కుంభస్థలములమీద తేజిపాదములు
యొకటిరెండు మూడుచాలా బాణములేసేను
యెడమచేతితో తట్టెనయ్యా రంగయ్యదొరగారు
నీను చెయ్యి ముందుమించెర లాల్కానుడుయప్పుడు
నాదు చెయ్యివస్తుంది యణగతట్టుకోర

వట్టాతోను నరికినాడు రంగయ్యదొరగారు
హాల్లాహాల్లా హాల్లాయంటు భూమినపడ్డాడు
హైదరుజంగు దండుమీదికి కలపటమయినారు
బల్యాముమీద చాతరించెను సైన్యమంతయు
తరిమితరిమి నరికినాడు రంగయ్యదొరగారు
యెగిరియెగిరి చంపినాడయ్యా గుఱ్ఱాలగుంపును
మాస్టులకు గొట్టియప్పుడు ముందుగ వేసెను
యెగిరితన్నగ ఫిరంగిబండ్లు యిరుసులుయిరిగెను
రక్తములోనె మొండెములన్ని పైకి తేలింది
అరవై మూడు రేఖలాలుగా మొహర్జాలెత్తిరి
వళవళయని కాల్చినారు ఫిరంగియప్పుడుదా
వెనుకవక్కన యున్నాడయ్యా హైదరుజంగోజి
జయించలేము జయించలేము రంగారాయడితో
అయిదుపుట్లనల్లమందు భూమినపఱచిరి
ఉక్కుకత్తులు సానకత్తులు మందునవేసిరి
రవలుచాల వేసినారు మందుకులోగాను
నాలుగువక్కల మందులతాళ్ళు తగిలించినారు
మున్నాటికికవాతుగుఱ్ఱము ముందుగనిలిపిరి
గుఱ్ఱమని దూకినారు యల్మాదొరలుదా
తెలియకవచ్చి నల్లమందులో గప్పునపడినారు
నాలుగువక్కల మందుతాళ్ళకు నిప్పులుబెట్టిరి
భగ్గున భగ్గున రగిలెనయ్యా మందులుఅప్పుడుదా
ముందువెలుపల దుమికినాడు రంగయ్యదొరగారు
కూడయున్న యల్మాదొరలు మందునచచ్చిరి

రంగయ్యదొర బారాతేజి మందునచచ్చింది
వొంటిగానునిలిచినాడయ్యా రంగయ్యదొరగారు
నిప్పులుబెట్టెజాతులవారిని గొంతులుకోసెను
తరిమితరిమి నరికినాడు రంగయ్యరావుదా
అరవై రెండుతుపాకులంతా మొహర్జాలెత్తిరి
పళపళయనికాల్చినాడు టుపాకిలంతాను
చుక్కవంటి టుపాకిదెబ్బ నెత్తినతగిలింది
వీపునతగిలినగాయాలన్ని యెంచతరముగాదు
రక్తమప్పుడు గారుతున్నది గాయాలగుండాను
పేగులుకండలు జీరాడెను రంగారాయుడికి
జీరాడే పేగులుయెత్తి దట్టిలోగట్టెను
తరిమితరిమినరికినాడు తొంబయిమందిని
నిల్వబలము లేకవుండెను రంగయ్యదొరగారు
యింతబ్రతుకుబ్రతికినేను వీరిచేతిలోను
వీరిచేతనుచావనునాకు జాతకమున్నదా
మండవేసికొల్వుతీరెను రంగయ్యదొరగారు
బాకుయెత్తివిసరివేసెను రంగయ్యదొరగారు
బాకువచ్చి రొమ్మునతగిలి భూమినపడ్డాడు
మండమీదనేప్రాణమువిడిచె రంగయ్యదొరగారు
రంగారాయుడుచచ్చాడని ఢంకాకొట్టిరి
వెళ్ళిపోయిన దండుచాలా తిరిగివచ్చింది
కొండదాటి వచ్చినాడు ప్రాంచిదొరగారు
రంగారాయుడిబేటికిరాజు వస్తువున్నాడు
రాజుగారు ప్రాంచివారు షామిలైనారు

రంగారాయుని చక్కదనమును చూడవస్తారు
అంతలోన యేమన్నాడు విజయరామరాజు
నమ్మరాదు నమ్మరాదు బొబ్బిలివారిని
చచ్చినాడని దగ్గరకైనా మనమేపోతేను
దిగ్గునలేచిలడాయిచేతురు బొబ్బిలిదొరలుదా
ఈరీతిగా చెప్పినాడు విజయరామరాజు

ఈకొతోను కదలించినాడు రంగారావును
బొందిలోను జీవములేక తానేయున్నాడు
దగ్గరకైనయప్పుడువచ్చె ప్రాంచిదొరగారు
అద్దముపోడుగు చక్కదనము కన్నులచూచెను
వీపునందు వింజామరలే రంగారాయుడికి
బొడ్డునందు చింతామణిదా రంగారాయుడికి
ముంజేతికి మీసమున్నది రంగారాయుడికి
రాజచిహ్నములకన్నులచూచె ప్రాంచిదొరలుగా
ఘోరఘోరమునదుఃఖించినాడు ప్రాంచిదొరగారు
తెలియకనేను బొబ్బిలిదొరలనుచంపుకొంటిని
క్రూరకర్ముడుకులద్రోహుడు విజయరామరాజు
కర్మచండాలునిమాటలుచాలా నేనువింటిని
పాపిచండాలుని మాటలుచాలా నేనువింటిని
యిటువంటి వస్తాదులు భూమినయుంటేను
ఎంతమంది శూరులనైన జయించువారలుగా
ఈరీతిగా దుఃఖపడెను ప్రాంచిదొరగారు
చాలాసేపు దుఃఖపడెను ప్రాంచిదొరగారు
దహనమైనచేసినాడు ప్రాంచిదొరగారు

రాజువారు. ప్రాంచివారు పామీలైనారు
బొబ్బిలికోటవచ్చినారు యిద్దరుయవ్వాడుదా
కోటలోను శోధించినారు యిద్దరుయువ్వాడుదా
యేపరిక్కజూచినగాని స్త్రీలమరణంబు
యేనగరిలో జూచినగాని శిశువులమరణంబు
అప్పుడేమని చెప్పినాడు ప్రాంచిదొరగారు
స్త్రీహత్యయు శిశుహత్యయు యెవరిదన్నాడు
స్త్రీహత్యయు శిశుహత్యయు నాదేయన్నాడు
తట్టుతురాజా యేడుబండ్లు కట్టించినాడు
పీనుగులైన యెత్తించినారు ప్రాంచిదొరగారు
మూడుచెర్వులేమిక్కటమైనాదిపీనుగలంతాను
కోటయంతాశుద్ధిపరచెను విజయరామరాజు
తెల్లవారితేరాజుగారికి పట్టముగట్టుతాము
డేరావద్దకు వచ్చినారు యిద్దరుయవ్వాడుదా
దిశలుతీరి డేరాలోగా వారేయున్నారు
వీరికథలు యీలాగున్నది బొబ్బిలిలోగాను
మూడురోజులకు దాకలైనాది వెంకటలక్ష్మమ్మ
రాజారముచేరినాది వెంకటలక్ష్మమ్మ
వరాహంచక వినుముయిప్పుడు పాపారాయుండా
నిండుకొలువునయున్నాడండి పాపారాయూడు
బాలునియప్పుడు చేతికిచ్చెను వెంకటలక్ష్మమ్మ
అప్పుడేమని యడిగినాడు పాపారాయుడు
బావగారు రంగయ్యదొరలువస్తుయున్నారా
అప్పచెల్లెలుమల్లమ్మదేవి వస్తుయున్నాదా

పల్లకిలేదా సవారిలేదా వెంకటాద్రియుడికి
వొంటిబాటుగా రావనేలా వెంకటలక్ష్మమ్మ
వొంటిగాను వెంకట్రాయనియెత్తుకవస్తివి
అట్టిమాటలకు యేమన్నాది వెంకటలక్ష్మమ్మ
పరాకుంచక వినుడిమీరు పాపారాయుడా
కోటవిడిచిమీరిక్కడకొచ్చిన తొమ్మిదోనాడు
కోటమీదికెదళము తెచ్చెను విజయరామరాజు
యెంచిచూడక ప్రాంచివారిని తెచ్చిపెట్టేను
కోటనునాలుగుప్రక్కలవారు ముట్టడించినారు
మూడుదినములుదాక యుద్ధము జరుగుతున్నాది
మీచోటికిపంపినారు దేవీమల్లమ్మ
యీమాటలు విన్నాడయ్యా పాపారాయుడు
యెంచరాని కోపముగలిగె పాపారాయునికి
యింతపనికీవచ్చినాడా విజయరామరాజు
నేనకోటలోపలలేకచూచి విజయరామరాజు
కోటలోపలకొలుపువచ్చెనా విజయరామరాజు
ఈబాటలోవస్తాడని బాటకాచినాను
దొంగముచ్చుదుమికినాడు విజయరామరాజు
మూడుదినములనుంచి యుద్ధముజరిగితే
కబురులేక చేసినాడా రంగారాయుడు
కబురులేక జేసినాడా వెంగళరాయుండు
రాజుగారువచ్చినసమయము నీవేజూచెదా
కొంచెంసంగతిచెప్పకపోతివి వెంగళరాయుడా
నల్లయేరునుదాటనిస్తునా రాజునునేనుదా

యింతసేపుసిల్వనిత్తునా కోటలక్రిందాను
తట్టుకోటకుబలియిస్తును రాజునునేనుదా
పుట్టుకోటకు బలియిస్తును పాత్రించినినేనుదా
మొరుకలేక చేసినాడు వెంగళరాయుండు
మంచిదన్నాడు బాగన్నాడు పాపారాయుడు
తన్నుకొలిచేరాణువలంతా తానుపిలిచినాడు
సింహాసనము వేసెనయ్యా వెంకటాద్రియునికి
సింహాసనమున కొల్వుతీర్చెను బాలునిగనుకాను
పరాకుంచకవినండిమీరు యల్మాదొరలారా
కాశీప్రయాణంఫలించిందయ్య యల్మాదొరలార
మూడునెలలుకాశీయాత్రలు పోయివస్తాము
ఆరునెలలజీతమంత యిప్పుడెయిచ్చేను
ముందునిలిచి వందనమొసగెనువెంకట్రాయునికి
చిన్ననాటిస్నేహితుడయ్యా మద్దాలవెంకన్న
మద్దాలవెంకన్నయునేటివాని కొలువుకుపిలచెను
సేవకుడైన మిర్యాల సీతన్న కొలువుకుపిలచేను
కాశీయాత్రకుబోయివత్తాము మనము నేడుదా
మంచిదన్నడుబాగన్నాడు మద్దాలవెంకన్న
అప్పుడేమని చెప్పినాడు పాపారాయుడు
అన్నలారతమ్ములార యల్మాదొరలార
చక్కగానుసాకండయ్యా వెంకట్రాయున్ని
నారీతిగావెంకటాద్రియునిజూస్తువుండండి
పరాకుంచకవినవేతల్లి వెంకటలక్ష్మమ్మ
బాలుని ఇప్పుడుసాకుతుండవే వెంకటలక్ష్మమ్మ

ఈరీతిగా చెప్పినారు ప్రియాణమైనారు
ముగ్గురునుగుఱ్ఱమెక్కి ప్రియాణమైనారు
కొంతదూరంకాశీయాత్రిలు వారునడచినారు
అక్కడనుంచివచ్చినారుగా బొబ్బిలికోటకును
బొబ్బిలివారి దేవిడిముందర రక్కసమండ్యాలు
రక్కసిమండ్యాల మద్దిమానులకేగుఱ్ఱముగట్టిరి
కోటకిరిందయప్పుడువచ్చిరి ముగ్గురయప్పుడుదా
కోటలోపల నాలుగుప్రక్కల కన్నులచూచిరి
మల్లమ్మ దేవిది వాణమునకు కదలివచ్చిరి
దీపము బెట్టను దిక్కులేదయాకోటకులోగాను
ఘోడుఘోడునదుఃఖించినాడు పాపారాయుడు
చావకన్నదరవాజాగుండ బైటికివచ్చిరి
చెరువులోకికదలివచ్చె పాపారాయుడు
కోటపీనుగుల చెరువులోపల వెతకిపట్టినాడు
అప్పచెల్లెలు మల్లమ్మదేవి శిరస్సు నుకాను
దహనమప్పుడు చేసినాడయ్యా పాపారాయుడు
నిమిషంబున నిత్యకర్మంబు తానుజేసినాడు
గుఱ్ఱములముందు వచ్చినాడు పాపారాయుడు
పరాకుంచక వినుమీరు మద్దాలవెంకన్న
వొంటివారి మన ప్రాణము గుఱ్ఱాలుయెందుకు
వారివారిగుఱ్ఱములుపట్టి యప్పుడేచంపిరి
ఆలోచనలు చేసినాడయ్యా పాపారాయుడు
తూర్పుసీమ రాజులవేషము వారు వేసినారు
రొమ్మునందుజంజను వేసిరి ముగ్గురయప్పుడుదా

బొమ్మంచుల ధోవతులప్పుడు బిగియగట్టినారు
అచ్చటనుంచివచ్చినారయ్యాముగ్గురుయప్పుడుదా
కాగితమును కలముయిప్పుడు చేతనుబట్టిరి
అన్నకొడుకు ఆనందరాజుకు జాబువ్రాసినట్లు
దొంగజాబువ్రాసినాడయ్యా పాపారాయుడు
లకోటాలుచేసినాడయ్యా పాపారాయుడు
సేవకునియొక్క జేతికిచ్చెనుజాబునుయప్పుడుదా
పరాకుంచక విసుముయిప్పుడు మిర్యాలసీతన్న
అటకాయింపులేకుండానే దేరాకుపోతేను
రాజుకొల్వున జాబులుబెట్టివందనమొసగండి
జాబుకయినా నేనున్నాను మిర్యాలసీతన్న
ప్రొద్దుగ్రుంకి జాముప్రొద్దు అప్పుడేయున్నాది
అలసిసొలసి నిద్రపోతారు రాజులందరుదా
దిగులుతీరి నిద్రిస్తాడు విజయరామరాజు
తెల్లవారితే రాజుగారికి పట్టముగట్టుతారు
పాగించివారి దేరాలకు కదలివచ్చినారు
పాగించివారి దేరావిడిచి రాజుదేరాకుదా
రాజుగారిదేరాలకు యప్పుడెవచ్చిరి
ముప్పైఇంటికిరవుతులు యప్పుడువరదిపోతారు
ముప్పైమందితో కలుసుకొన్నారుయప్పుడుదా
అటకాయింపులేకుండనె యప్పుడెపోయిరి
రాజుకొలువున నిలిచినారుముగ్గురుయప్పుడుదా
కన్నుసైగ చేసినాడు పాపారాయుడు
అప్పుడుయేమని చెప్పినాడయ్యా మిర్యాలసీతన్న

రాజుకొల్వున జాబులు బెట్టి వందన మొనగెను
ఎవ్వరితాలూక యన్నాడండీవిజయరామరాజు
అంతలోపలఅందుకొన్నాడు పాపారాయుంగు
పరాకుంచక వినండిమీరు రాజుగారుదొరలు
తూర్పు దేశంరాజులమయ్యా విజయరామరాజు
కొలువులేక నేవిజనగరము కొలువుకువచ్చితిమి
మీయన్నకొడుకు ఆనందరాజు ఏలుతున్నాడు
మీయొక్క బేటికిపొమ్మన్నారు ఆనందరాజు
మంచిదన్నాడుబాగన్నాడు విజయరామరాజు
జాబునప్పుడుజూచినాడయ్యా విజయరామరాజు
ఆనందరాజు వ్రాసినట్లు వ్రాతలుయున్నాది
ప్రొద్దుపోయినదిఇప్పుడుమీతో మాటలెందుకు
తెల్లవారిబేటికివస్తెమువ్వురికైనాను
తగినట్లుగాను జీతముమీకు నేనుయిస్తాను
భోంచేసుకోని పుదయమందు నాబేటికిరన్నండీ
ఇట్టిమాటలుచెప్పినాడయ్యా విజయరామరాజు
పప్పుబియ్యము తీసుకొనిదా బైటికివచ్చిరి
పరాకుంచక వినుమయ్యా మిర్యాలసీతన్న
డేరాబైట పప్పుబియ్యం యెగచల్లినారూ
ముగ్గురును పవ్వళించిరి ఆఘడియలోన
అలసిసొలసి నిద్రబోయిరి ముగ్గురుఅప్పుడుదా
కలలోవచ్చి యేమన్నాది దేవిమల్లమ్మ
క్రూరకర్ముడుకులద్రోహుడువిజయరామ రాజు
కానిపోనిమాటలవల్ల నన్నుదూరినాడు

ముండమోసి తెమూడుగా)మూలినాములిస్తాడు
ముందుకూడు ముందుగుడ్డ నీదే యన్నాడు
ఈలాగున తిట్టినాడయ్యా విజయరామరాజు
రాజునిద్రపోతున్నాడు విజయరామరాజు
ఇదిసమయంబు యిదివేళరా పాపారాయుడా
తట్టియపుడు లేవగొట్టెను మల్లమ్మదేవిదా
తటుక్కున నిద్రలేచెను పాపారాయుడు
కాలుసైగచేసినాడు పాపారాయుడు
ముగ్గురున్ను త్రుళ్ళిపడియు లేచిరియపుడున్ను
పడకలోనె దట్టిగట్టిరి ముగ్గురుయప్పుడుదా
డేరాలోవల జొరబడ్డారు ముగ్వురుయప్పుడుదా
మీరాసాయెబుగస్తి అపుడు తిరుగుతున్నాడు
నీనువంతు వచ్చిందయ్యా మద్దాలవెంకన్న
మొలనయున్న బాకునుయపుడు దబ్బునతీసెను
గొంతుయందు బొడిచినాడు మద్దాల వెంకన్న
గిరగిరమని తిరిగియపుడు భూమినపడ్డాడు
రాజుబేటికివస్తున్నాడు పాపారాయుడు
రాజుగారి సేవకుడయ్యా చల్లారాముండు
పాపారాయుడు వస్తున్నాడు చల్లారాముండు
నీదువంతువచ్చిందయ్యా మిర్యాలసీతన్న
పచ్చలబాకు నడుమునుంచి భగ్గునతీసెను
వానినోట పొడిచినాడయ్యా మిర్యాలసీతన్న
పొడచినంతలో గిరగిరతిరిగి భూమినపడ్డాడు
రాజుగారు నావంతన్నాడు పాపారాయుడు

వానిరొమ్ముమీదనేకొల్పుతీసెన పాపారాయుడు
కాళ్ళుయపుడు గట్టిగపట్టెను మిర్యాల సీతన్న
శిరస్సుయపుడు గట్టిగపట్టెను మద్దాలవెంకన్న
అప్పుడేమనివ చెప్పినాడు పాపారాయుడు
తట్టితట్టిలేపెనయ్యా విజయరామరాజు
మేలకరించిలేచినాడయ్యా విజయరామరాజును
వారేఈకెఎక్కడబల్లెమెక్కడగల్లారాముడా
ఈకెఎందుకు బల్లెమెందుకు విజయరామరాజు
పక్కలోనే బాకై యున్నాను పాపారాయున్ని
దొంగబాటవస్తివిగదర విజయరామరాజా
బొబ్బిలికోట తీస్తామని ప్రతిజ్ఞ చేసితివి
ఎవ్వరిపంతము సాగెదోయి విజయరామరాజు
ఇట్లుచెప్పుతు బాకుతీసెను పాపారాయుండు
రొమ్ములమీద గుమ్మినాడయ్యా పాపారాయుడు
గుభల్ గుభళ్ళునిరక్తముగక్కి జీవముడిచేను
భూమిమీద నేత్రోసినాడయ్యా మంచముపైనుంచి
డేరావిడిచి బైటికివచ్చిరి ముప్వురుయపుడుదా
బొబ్బిలిపులివచ్చెనని కూతలుబెట్టెను
కల్వరించి నిద్రలేచిరి రాజులదండుదా
వొక్కరిబల్యముయిద్దరుపట్టిరి దండుకులోగాను
అన్నయని తెలియకుండ తమ్ముడుజంపెను
కల్వరించి నిద్రలేచెను ఫ్రాంచిదొరగారు
రాజుగారిదండుకులోగా సండడికిన్నారు
ఫ్రాంచివారిబేటికివచ్చె దుబాసిలక్ష్మయ్యా

నన్నుపిలిచినకారణమేమి ప్రాంచిదొరగారు
రాజుగారిదండుకులోగా సందడియేమండి
పన్నెండులక్షలపైకముమీకు యివ్వవలెనండి
పైకంకట్టవలెననియెంచి పైకివస్తాడు
వంచుమయ్యా వంచుమయ్యా ఫిరంగిలపుడుదా
మందుగుండువేసియప్పుడు గెట్టనచేసిరి
ఫళఫళయనికాల్చినారు ఫిరంగిలంతాను
పిలుచుటకు యెవరులేరు రాజుదండులోగా
మూడునిమిషములు తాజూచెనుపాపారాయుడు
నాకుమాటలు వినండిమీరు మద్దాలవెంకన్న
నొంటరిగా నిలచితిమిమనకు కోటలుయెందుకు
అన్నతమ్ములు బావమరుదులు యందరుజచ్చిరి
రాజుగారిని జంపినాము పేరుజెందినాము

రచ్చాబండా రేవులకాడ పాపారాయుడు
మండెవేసికొలువుతీరెను పాపారాయుడు
బాకుయెత్తి రొమ్మునగుద్దిభూమినయొరిగెను
వానివెంటనే కొలువుతీరెను మద్దాల వెంకన్న
బాకుయెత్తి రొమ్మునపొడిచి భూమినపడినాడు
యందరును చచ్చినారయ్యా అరనిమిషములోన
పాపారాయుడుచచ్చినసంగతి ప్రాంచియెరిగెను
రాజుగారిని చంపినసంగతి ప్రాంచియెరిగెను
యింకను యెందరున్నారో బొబ్బిలికోటలో
నిమిషమైనయుండగూడదు కోటలోపలాను
కట్టినారయ్యా డేరాలంతయు గాడిబండ్లమీద

యెత్తినాగయ్యాడేరాలంతా యెద్దులవయినాను
ఇరవై నాలుగు వేలదళముతో ప్రాంచివచ్చినాడు
మున్నూటితో తిరుగమల్లెను ప్రాంచిదొరగారు
రాజమహేంద్రముజిల్లాచేరెను ప్రాంచిదొరగారు
ఆనందరాజును పాంచిగారు పిల్పించెను
ప్రాంచివారి బేటికివచ్చి సలాంచేసెను
యిద్దరున్నకుర్చిమీద కొలువుతీరినారు
పిన్నయ్యేడి పిన్నయ్యేడి పాంచిదొరగారు
తెల్లవారుతే రాజుగారికి పట్టముగట్టుతాము
తెల్లవారితే పన్నెండులక్షల డబ్బుకట్టవలెను
యింతలోన చెల్లుకొన్నాడు విజయరామరాజు
ముందుపైకము గట్టినవెనుక మీకేలేవండి
నమ్మివచ్చి తోడ్కానిపోతివి ప్రాంచిదొరగారు
బొబ్బిలివారిని చంపినావు ప్రాంచిదొరగారు
అప్పుడు యేలాగున్నాడండి ఆనందరాజు
మంచిమంచియేనుగులన్ని యమ్మివేసినాడు
మంచిమంచిగుర్రములన్ని యమ్మివేసినాడు
ఆరులక్షలపైకము యప్పుడె చెల్లించినాడు
పైకమప్పుడు పుచ్చుకొని పాంచిదొరగారు
పుదుచ్చేరికి చేరినాడయ్యా పాంచిదొరగారు
వారికథలు ఆలాగున్నది పుదుచ్చేరిలోన
అప్పుడేలాగున్నాడయ్యా వెంకట్రాయుడు
రాజారము యేలుతున్నాడు వెంకటాయుడు
యీపైముగ్గురుయల్లాబిడ్డలు వెంటనెయున్నారు

పిన్నతల్లి జగ్గమ్మదేవి వెంబడి యున్నాది
పన్నెండేండ్లుపోయినసంగతేమి జగ్గమ్మదేవి
యెన్నడురానికోపముకలిగె వెంకట్రాయడిక
అంతపనికివచ్చినాడా విజయరామరాజు
పుదుచ్చేరి యేలెవాడు ప్రాంచిదొరగారు
మూకోటలు కోలుపుచ్చినా ప్రాంచిదొరగారు
అచ్చటినుండి వచ్చినాడయ్యా వెంకట్రాయుడు
తన్నుకొలిచె రాణువలంతా తానుబిలచుకోని
యాబై మువ్వురు ఉల్లామదొరలనువెంటతీసుకొని
గుఱ్ఱమపుడుయెక్కినాడయ్యా వెంకట్రాయుడు
యాబై మువ్వురుయుల్లామదొరలువెంబడివస్తారు
గోల్కొండకు చేరినాడుగా వెంకట్రాయుడు
బాదుషావుల దర్శనమునకై కాచియున్నాడు
ఆలోచనలు చేసినాడు వెంకట్రాయుడు

పడమటిశీమ హుండీరూకలు వస్తువున్నాది
కనముకాచి యున్నాడయ్యా వెంకట్రాయుడు
అచ్చటినుండివచ్చినారయ్యా హర్కారులపుడుదా
బాదుషావులబేటికివచ్చె హర్కారులపుడుదా
సలామయ్యా సలామయ్యా బాదుషాదొరగారు
పడమటిసీమ హుండీరూకలు దీసుకొచ్చినాము
కనమగాచి యున్నారయ్యా యీవేళ లోగా
అట్టిమాటకు యేమన్నాడు బాదుషాదొరగారు
హుండీరూకలుకొట్టెవాడు యెటువంటివస్తాడు
ఏనూటిదండు వెంటతీసుకోని బాదుషాదొరగారు

కనుమకాడికి వచ్చినాడయ్యా బాషాదొరగారు
కుర్చీమీదవున్నాడండి వెంకట్రాయుడు
బాషావులకన్నులచూచె వెంకట్రాయుడు
యెదురుసేవకు యేడడుగులు ముందుగనడిచెను
ఎవ్వరితాలూకవున్నారయ్యా బాషాదొరగారు
బొబ్బిలివారితాలూకాయని తాను చెప్పినాడు
బొబ్బిలివారితాలూకాయంటె నీవెవరన్నాడు
రంగయ్యదొర కుమారుడనగ వెంకట్రాయుడ
హుండీకొట్టిన సంగతియేమి వెంకట్రాయుడా
బొబ్బిలికొట్టినసంగతియేమి బాషాదొరగారు
రాజుగారిని వారించివారిని పామాలంపితిమీ
బొబ్బిలికోటకొలువుచ్చిరి బాషాదొరగారు
ఆరునెలలు దర్భాపుకాచి బాషాదొరగారు
నీదర్శనమునకు కాచియుంటిని బాషాదొరలుదా
నేటివరకు కనుముకొట్టి కాచియుంటినయ్యా
నాకోటలును కోలుపోయి పన్నెండేళ్లాయె
తల్లిగారు మల్లమ్మదేవి యలసట బంపింది
అప్పుడు నేనుసంవత్సరపుబిడ్డ బాషాదొరగారు
గారాబంబున పెరిగినేను పేటికివచ్చితిని
యెప్పటివలె బొబ్బిలికోట మాకేయివ్వండి
విన్నతోడనే సంతసమాయె బాషాకపుడుదా
బాలునియెత్తి వొడిమీదపెట్టి ముద్దులాడినాడు
అంబారిలోనకొలువుతీర్చిరి వెంకట్రాయున్ని
నాలుగువీధులుత్రిప్పినాడయ్యా వెంకట్రాయున్ని

బొబ్బిలికైనా వచ్చినారయ్యా బాదుషా దొరగారు
యెప్పటివలెనే బొబ్బిలికోటలు పట్టంకట్టెను
రత్నఖచిత తగత్తుమీద కొలువుంచినారు
చేతనున్న శిఖావుంగరము చేతబట్టినాడు
అప్పుడేమని చెప్పినారయ్యా బాదుషా దొరలుదా
నీతండ్రులు పిన్నతండ్రులు వెంకట్రాయుడా
నాకెరుకచేయకకోటనంతయుకొలుపుచ్చుకొనిరి
ఆలాగున చేయవద్దురా వెంకట్రాయుడా
కోటమీదకు పరాయిదొర రాయిగవచ్చితేను
కావలసిన సిబ్బందులు నేనుపంపుతాను
ఈరీతిగా ధైర్యమైన మాటలుజెప్పెను
అక్కడనుంచిప్రయాణమాయెనుబాదుషాదొరలు
గోల్కొండకువచ్చినారయ్యాబాదుషాదొరలుదా
దుబాసివారి లక్ష్మయ్యను కొలువుకు బిలిపించి
యేనుగయొక్కకాలుకిందత్రొక్కించె దాను
బొబ్బిలికోటయేలుతున్నాడు వెంకట్రాయుడు
శృంగారముగాబొబ్బిలికోట ఏలుతువున్నాడు
చదివినవారికివిన్నవారికి సకలభాగ్యములును
శ్రీహరియొసగునుతప్పకుండనీక్షితితలంబులోను

పెద్ద బొబ్బిలి రాజు కథ
సంపూర్ణము.

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె, సికింద్రాబాద్.